# జీవితం - సందేశం

***

శ్రీధరబాబు

***

మానవ విజ్ఞాన మందిర ప్రచురణ
హైదరాబాదు.



ఫ్రెడరిక్ మాక్స్‌మూలర్

జననం 6 డిశంబరు 1823 — మరణం 28 అక్టోబరు 1900

# ఆప్తవాక్యాం

ఉదారచరితులకు వసుధయంతయు తమ కుటుంబమే-దేశ దేశముల మధ్య ఉన్న సరిహద్దులు వారి భావగతిని అరికట్టలేవు. జాతుల మధ్య కన్పట్టు విభేదములను వారి ప్రేమప్రవాహము అంతరింపజేసి సర్వ మానవ కళ్యాణమునకు రాచబాటలను రూపొందించును. అట్టి మహాత్ముల కృషిని, వారి విచారధారను ఆలంబనములుగ గొనియే, మానవజాతి అన్ని అవరోధములను ఎదుర్కొని వానిని అంతరింపజేసి వసుధైక రాజ్యమును సంస్థాపించు కృషిలో క్రమగతిలో మెల్లగనైనను కొంత ముందంజ వేయ గలుగు చున్నది.

మానావేతిహాసమును పరికించినపుడు మానవజాతిలో ఈ భావైక్యమును సంతరింపజేయుటకు కృషిచేసిన మహాశయులసంఖ్య అత్యల్పముగనే కన్పట్టును. అట్టి అల్పసంఖ్యాకులలో ఒకడుగ లెక్కింపదగిన వాడు మాక్స్‌ముల్లర్.

మాక్స్‌మూలర్ జీవించినది 19వ శతాబ్దమున, ఆశతాబ్దమునకు ఒక విశిష్టతకలదు. మానవేతిహాస రంగమున 15 వ శతాబ్దమువరకు ప్రముఖ స్థానములను ఆక్రమించి, తక్కిన ప్రపంచరాజ్యములకు అంతటివరకు నాగరికతాభిక్షను ప్రసాదించినవిగ పేరొందిన ఆసియారాజ్యములు-భారతదేశం, చీనామొదలగునవి—15 వ శతాబ్ది మొదలుగ పతనోన్ముఖములై —19వ శతాబ్ది ఆరంభమునకు పాశ్చాత్యరాజ్యముల సామ్రాజ్యకాంక్షకు బలియైనవి. ఆసియాయేకాదు; యావత్ప్రపంచమును ఆ శతాబ్దమున పాశ్చాత్య నాగరికతకు లోనైనది.ఎల్లెడల ఆ శతాబ్దమున పాశ్చాతసభ్యత దేపై చేయి. దాస్య నిమ్నములగు భారతదేశాదుల ప్రాచీన సంస్కృతి సభ్యుల యెడల ఒక విధమగు నిరసన పాశ్చాత్యులలోనేకాదు, ప్రాచ్యదేశీయులందును ఆనాడు కననైనది.

ఈ విధముగ మానవజాతి ఆ కాలమున రెండువర్గములుగ విభక్తమైనది; అందొకటి పాలకజాతికి చెందిన పాశ్చాత్యవర్గము, రెండవది

శేషించిన మానవజాతి. అందు మొదటిదానికి రెండవదానిపై నిరసన; రెండవదానికి మొదటిదానిపై విద్వేషము. ఈ రెండు విధములగు భావనలును మానవజాతి పురోభివృద్ధికి భంగకారులే. అవి అడులేని రీతిలో విజృంభించియుండినయెడల సర్వనాశనమునకు త్రోవదీసి ఉండెడివే. కాని వానిని అరికట్టిన కల్యాణకారకశక్తులును కొన్ని ఆనాడు దార్శనిక. రాజకీయ, సాంస్కృతిక రంగములందు పైకి రాగలిగినవి. వాని ఫలితముగనే క్రమముగ సామ్రాజ్యవాదము ఈ ఇరువదవ శతాబ్దమున అంతరించుట సంఘటిల్లినది.

ఇటుల సామ్రాజ్యవాదము అంతరించుటకు కారణభూతములగు దార్శనిక, రాజకీయ, సాంస్కృతిక శక్తులలో తొలుతటి రెండింటిని గురించి పలువురకు లెస్సగ తెలియును. వానికి సంబంధించిన సారస్వతమును విరివిగ ఉపలబ్ధము. వీనిలో రాజకీయ శక్తుల విషయమున అతిమాత్రముగ ప్రచారము అన్నియెడల సాగుటయేకాక ఆ ప్రచారము కడకు తక్కిన రెండింటివి అంతకన్న ముఖ్యంగ సాంస్కృతిక శక్తుల ప్రాముఖ్యమును మరుగుపరచినది. ఇటుల తాత్కాలికముగ ప్రజల దృష్టిలో ప్రముఖతను కోల్పోయినను, ఐతిహాసికుని దృష్టిలో సాంస్కృతికశక్తులకు అమిత ప్రాముఖ్యము కలదు. ఆ విషయమును విశ్వేతిహాసపు గతియే ఋజువు చేయుచున్నది. అది రాజ్యము కానిండు, లేదా సామ్రాజ్యము కానిండు. అందలి ప్రజలలో సాధింపబడిన సాంస్కృతికైక్యపు మేరకే అది సఫలతను, స్థిరతను ఆర్జించినది. అట్టి సాంస్కృతికైక్యమును సాధించుటలో విఫలమైనపుడు, అది తన ప్రతిపత్తినే కోల్పోయినది.

గడచిన రెండు శతాబ్దములనుండియు సాగిన విజ్ఞానశాస్త్ర పురోగతి నేడు ప్రపంచమందలి వివిధ రాజ్యముల మధ్య దూరతాభావనను సమయింపజేసినది; దేశముల మధ్యగల సరిహద్దు రేఖలను అర్థరహితములుగ చేసినది. మానవజాతి ఈ గోళముపై తన మనుగడను ఇకముందును సాగింపదలపెట్టినయెడల అందులకు వసుధైకరాజ్యము ఏదియో ఒకతీరున రూపొందవలసిన ఆవశ్యకతను అణు విజ్ఞానశాస్త్రము మనకు నేడు విస్పష్టము చేసినది. ఈ గమ్యమును నేడు కాదనువారులేరు. కాని అట్టి

దానిని సాధించుటకై అనుసరింపదగు మార్గము ఎట్టిది? అను విషయ మును గురించి మాత్రమే విభిన్న రాజకీయ వాదములు వేర్వేరు మార్గము లను సూచించుచున్నవి. ఆయా రాజకీయ వాదముల ప్రసక్తి ఇట మనకు అప్రస్తుతము. అందలి ఏదియో ఒక మార్గమున వసుధైకరాజ్యము రూపొందగలదనియే అనుకొందము. అయినను అది మాత్రము పూర్వపు సామ్రాజ్యములవలెనే భిన్నాభిన్నమై అంతరింపక సుస్థిరతను ఆర్జించి మన గలదా అను సందియము కలుగుటకు తావు కలదుగదా! ఇందులకు సమాధా నము విశ్వేతిహాసపు గత చరిత్రనుండి మనకు లభ్యమగుచున్నది ఆ వసు ధైక రాజ్యము తన మనుగడకై సైనిక శక్తిపైనను, రాజకీయవాదముల పైనను ఆధారపడుటకన్న ప్రజానీకమున సాధింపబడు సాంస్కృతిక సమైక్యముపైననే ఎక్కువగ ఆధారపడినపుడు మాత్రమే దానికి సుస్థిరత చేకూరగలదు.

విభిన్న మానవజాతుల మధ్య ఇట్టి సాంస్కృతిక సమన్వయమును సాధించు కార్యక్రమమునకు బీజావాపనము, ఇదివరలో చెప్పబడినట్టుల 19వ శతాబ్దముననే జరిగినది. దేహవర్ణము, భాష, మతము మొదలగు వానియందలి వైవిధ్యమువలన వేరువేరుగ కన్పట్టి మానవజాతులలోని సామాన్యాంశముల ప్రాముఖ్యమును వెలికితెచ్చి చారిత్రకగతిలో అసహజ విషయముల ప్రాధాన్యమును సంతరించుకొనిన తాత్కాలిక విషయముల ప్రశస్తిని సన్నగిల్లజేసి, మానవ సమానత్వమును విశాల హృదయులగు పండితులు కొందరు ఆ శతాబ్దమున ఉద్ఘాటించిరి ఈ సమానత్వ ప్రతిపా దనకు విజ్ఞానశాస్త్రము మొదలగునవి తోడ్పడుట యధార్థమే అయినను భాష, మతము, కళ మొదలగు సాంఘిక విషయముల, తులనాత్మక పరిశీ లనకు పూనుకొని, సాంస్కృతికరంగమున పనిచేసిన పండితులందు ఎంతయో తోడ్పడిరనుటను మరువరాదు. అట్టి పండితులలో అగ్రతాంబూ లమునకు అర్హుడు మాక్సుమూలర్. అతడు పూనుకొనిన సాంస్కృతిక సమన్వయమున అతనికి సాధనముగ ఉపకరించినది సంస్కృత భాషలో అతనికి లభించిన అసమాన పరిచితి.

ఈ సందర్భమున ఒక విషయమును మనము మరువరాదు. సంస్కృతమును అభ్యసించిన యూరపీయునులతో మాక్సుమూలర్ తొలు

తటివాడు కాదనుట గమనార్హము. అతనికి పూర్వముననే సంస్కృతభాషా సారస్వతములు కొందరు యూరపీయ పండితుల దృష్టిని ఆకర్షించినవి. చారిత్రక రీతిలో పరిశీలించిచూడ యూరపునకు సంస్కృతభాషతో పరిచితి క్రీస్తుపూర్వముననే కలిగినదని చెప్పవచ్చును. పైథాగరస్ పండితుడు భారతీయ దార్శనిక భావములకు కొంత ఋణపడి ఉండెననుటలోని యాథార్థ్యము ఎటులున్నను, అలెగ్జాండరు దండయాత్రాకాలమునుండియు గ్రీకులకు గీర్వాణ భాషతో పరిచితి ఏర్పడెననుటలో సందియమునకు తావులేదు. క్రీ॥పూ॥ 3వ శతాబ్దికి చెందిన అశోకుడు తన ప్రాకృత శాసనములలో కొన్నింటిని గాంధార రాష్ట్రమున గ్రీకులిపిలో వెలయించెననుట స్పష్టము. అందువలన ఆ కాలముననే గాంధారప్రాంతపు గ్రీకువలసలలో గ్రీకులిపిలో ప్రాకృత భాషా పఠనము సాగుచుండెననియు తద్వారా వారికి సంస్కృత భాషతో చక్కని పరిచితి ఏర్పడియుండుననియు భావింపవచ్చును. క్రీస్తుశకారంభకాలమునాటికి భారతదేశ వాయవ్యప్రాంతమున వలసలను నెలకొల్పుకొనిన గ్రీకులలో కొందరు ప్రముఖులు భాగవతమతమును, మరి కొందరు బౌద్ధమతమును అభిమానించిరనుట శాసనముల వలనను, మిళిందపన్హాది గ్రంథముల వలన తెలియుచున్నది. అటుల ఆ మతములను అవలంబించినవారు ఆయా మతముల ప్రామాణిక గ్రంథముల మూలభాషయగు సంస్కృతముతో పరిచితిని ఆర్జించియుందురని విశ్వసింపవచ్చును. తరువాతి కాలమున యూరపుతో భారతదేశమునకు సంబంధము విచ్ఛిన్నమైనను, అప్పటిలో పారసీక రాజ్యమును ఏలిన ససానియన్ రాజుల ఆస్థానము భారతీయ పండితులను, రోమన్-గ్రీకు పండితులను కలసికొని పరస్పర పరిచితిని ఆర్జించుటకు వేదికగ ఉపకరించినది. ఇస్లామిక మత విజృంభణవలన ఈ సంబంధము పైతము అంతరించినది. కాని అంతటి నుండి అనగా క్రీ. శ. ఎనిమిదవ శతాబ్ది మొదలుగ అయిదు శతాబ్దముల కాలము అరబ్బీ పండితులు సంస్కృత భాషాప్రముఖ గ్రంథములను తమ భాషలోనికి అనువదించి ఆ అనువాదములను తమ సామ్రాజ్యము వ్యాపించినచోటనెల్ల వ్యాప్తిలోనికి తెచ్చిరి. ఆ అరబ్బుల మూలముననే భారతీయుల అంకగణిత బీజగణితములును, అంకములస్థానపు విలువనుగురించిన పరిజ్ఞానమును యూరపునకు వ్యాపించి గణితశాస్త్రమున విప్లవకర పరిణామ

ములకు కారణభూతములైనవి. తరువాతి కాలమున పారసీక భాషలోనికి మొగల్ రాకుమారుడు దారాషుకోవలన అనువదింపజేయబడిన ఉపనిషత్తులను యూరోపియన్ పండితుల దృష్టిని ఆకర్షింపగలిగినవి. కాని ఆ ఇస్లామికయుగమున సంస్కృతభాషతో ప్రత్యక్షపరిచితి యూరోపియనులకు ఎవరికిని లభ్యముకాలేదు.

ఆఫ్రికా ఖండమును చుట్టి సముద్ర మార్గమున భారతఖండమును చేరుటను పోర్చుగీసువారు కనుగొనిన తరువాత 16 వ శతాబ్ది మొదలుగ యూరప్-ఆసియా ఖండములమధ్యగల సంబంధములలో ఒక నూతనాధ్యాయము మొదలయ్యెను. భారతదేశమున క్రైస్తవమత వ్యాప్తమును ఒక ముఖ్యలక్ష్యముగ పెట్టుకోగలిగిన పోర్చుగీసులు జెసుయిట్ మత ప్రచారకులకు ప్రోత్సాహమును కల్పించిరి. హైందవమత సంప్రదాయముల ఖండనకు పూనుకొనిన ఆ మత ప్రచారకులలో పలువురు అ ప్రయోజనము నిమిత్తమై సంస్కృత భాషాధ్యయనమునకు పూనుకొనిరి. అట్టివారిలో ఒకడగు కోర్దో పండితుడు లాటిన్ సంస్కృతభాషల సంబంధమును ఫ్రెంచివారికి ఎరుకపరచెను. (1760) ఆ తరువాత ఈస్టిండియా కంపెనీవారి ప్రభుత్వమున పనిచేసిన సర్ విలియంజోన్స్ పండితుడు అభిజ్ఞానశాకుంతలాది గ్రంథములను ఆంగ్లమునకు అనువదించుటయే కాక సంస్కృత భాష ప్రాచీనతను, భాషా విషయికముగ దానికి గ్రీకు లాటిన్ భాషలలో కన్పట్టు సన్నిహిత సంబంధమును తెలియజేయుచు వ్యాసములను ప్రచురించెను. 19వ శతాబ్ద ఆరంభమునకు క్రమముగ యూరపునందలి కొన్ని ప్రముఖ విద్యా పీఠములందు సంస్కృత బోధనాసౌకర్యములును, సంస్కృత గ్రంథముల వ్రాతప్రతుల సేకరణయు విరివిగ సాగినది. ఈ అవకాశమును వినియోగించుకొని ఆశతాబ్దపు పూర్వార్థమున ఫ్రాంజ్ బొప్, ష్లెగల్ మొదలగు జర్మన్ దేశీయులును, డెన్మార్క్ దేశపు రాస్క్ పండితుడును సంస్కృత భాషా వ్యాకరణ సంప్రదాయములను గురించి పరిశోధనను సాగించి, తమ కృషి ఫలితములను వెలుగులోనికి తెచ్చిరి. వీరిలో బొప్, ష్లెగల్ పండితులచే ప్రభావితుడైన వాడే మాక్స్‌మూలర్.

కాని ఒక విషయము సంస్కృత భాషావిదులగు తక్కిన పాశ్చాత్య పండితులనుండి మాక్స్‌మూలర్‌ను వేరుచేయుచున్నది. తక్కిన వారిని ఆకర్షించినది సంస్కృతభాషా స్వరూపము మాత్రమే. మాక్స్‌మూలర్ విషయము అట్టిదికాదు. ఒక ప్రాచీనజాతిసంస్కృతిని, సభ్యతను, అర్థం చేసికొనుటకు, ఆ అర్థము చేసికొనినదానిని పాశ్చాత్యలోకపు దృష్టికితెచ్చి, ఆ ప్రాచీనజాతియెడల మన్ననను రేకెత్తించి, సర్వమానవ సౌభ్రాతృత్వమునకు బాటను తీర్చుటకు సంస్కృతభాషాపరిచితి అతనికి ఒక సాధనముగ ఉపకరించినది.

అతని కృషివలన పాశ్చాత్య ప్రాచ్యలోకములకు రెండింటికిని మేలు జరిగినది. సామ్రాజ్యవాద దురహంకారమునుండి విడివడి సాటి మానవుని యథార్థరీతిలో దర్శించి, ప్రేమించుటకు అవశ్యకమగు కను విప్పును పాశ్చాత్యులకు అతడు కలిగించెను. అంతతోపాటుగ, నిరాశామగ్నమై స్వీయ సంస్కృతి ఘనతను మరచిన ప్రాచ్యజాతికి ఆత్మ విశ్వాసమును అతడు రేకెత్తింపగలిగెను. ఏ భారతీయుడును చేయజాలని భారతీయ సంస్కృతి ప్రచారమును అతడు సాగించెను. అందులకే వివేకానందుడు మాక్స్‌మూలర్‌పండితుని గురించి వ్రాయుచు సాయణుడే మాక్స్‌మూలర్‌గ పునర్జన్మ పొందెనని భావించెను.

మాక్స్‌మూలర్ పండితుడు అస్తమించి,ఇప్పటికి దాదాపు 70 సంవత్సరములు గడిచినవి. ఈ మధ్యకాలమున అతని అభిప్రాయములు కొన్ని పరాస్తములైనవి. అతడు వేదార్థమును గురించి వెలువరించిన అభిప్రాయములు అతని జీవిత కాలముననే బంకిం చంద్ర ఛటర్జీ వంటి కొందరివలన నిరాకృతములైనవి. బ్రాహ్మీలిపి రూపొందుటకు ఫోనిషియన్ లిపి మాతృకగ ఉపకరించినదని మాక్స్‌మూలర్ ప్రతిపాదించిన సిద్ధాంతము ఈనాడు అంగీకృతముగా లేదు. అయినను అతని ఘనత కాలపు పరీక్షలో నిగ్గుదేరి ఈ నాటికిని చెక్కుచెదరక నిలచియేయున్నది. భాషల తులనాత్మక పరిశీలనకు, మతముల తులనాత్మక వివేచనకు, తద్వారా సాంస్కృతిక సమైక్య సాధనకు ఆయన మార్గదర్శి కాగలిగెను. మానవ కళ్యాణ సాధనకు అదియొక రాచబాట.

ఇట్టి అసమాన కృషిని నిర్వహించిన మాక్సుమూలర్‌కు భారతీయులు ఎంతయో ఋణపడి ఉన్నారని వేరుగ చెప్పనవసరము లేదు. అయినను ఆ మహాశయుని జీవితకృషిని తెలియజేయు గ్రంథములు భారతీయ భాషలలో ఎక్కువగ ప్రచురితములైనటుల కన్పడదు. తెలుగు భాషకు సంబంధించినంతవరకు ఆలోపమును ఈగ్రంథము పూరించుచున్నది.

గ్రంథ రచయిత శ్రీ శ్రీధరబాబునుగురించి ఆంధ్రపాఠక లోకమునకు పరిచయము చేయవలసిన ఆవశ్యకత లేదని భావింతును. ఇదివరకే కొన్ని గ్రంథముల రచనచే పాఠకలోకమునకు అతడు సుపరిచితుడు. విశ్వవిద్యాలయమున అతడు పఠించినది దర్శనశాస్త్రము మాత్రమే. కాని విద్యాలయ ప్రాంగణమును దాటిన తరువాత మానవతాసమస్యలను అరయము చేసికొనుటకు అతడు సాగించిన కృషిలో అతని విచికిత్స పలు విద్యాశాఖలను వలగొనినది అందువలన ఉపనిషత్కథలు, మానసికశాస్త్రము మొదలగు ప్రౌఢవిషయములు అతని రచనావస్తువులుగ ఉపకరించినవి. ఆ రచనాసౌధమున ఈ గ్రంధరచనతో ఇంకొక సోపానము ఈ రచయిత పైకెక్కగలిగెను.

రచనావస్తువునందు ఒకవిధమగు తాదాత్మ్యము రచయితకు కలిగినపుడే రచనయందు రమ్యత ఘటిల్లును. అట్టి తాదాత్మ్యము ఈ రచనయందు ఎల్లెడల కన్పట్టుచున్నది. మాక్సుమూలర్ ఆదర్శమయ జీవితమును ఆకళింప చేసికొని, దానిని పాఠకునికి అందించుటయందు సమధిక కృషిని రచయిత జరిపెననుట పాఠకులు ఎల్లెడల గుర్తింపగలరు.

విద్యార్జనారంగమునను. రచనారీతియందును శ్రీ శ్రీధరబాబు సముచిత పురోగతిని సాధించినవాడు. కాని వయో విచారణను అనుసరించి ప్రౌఢనిర్భరవయఃపరిపాకమును అందుకొననివాడు. జీవితమున ఎంతయో సాధించుటకు అనువగు కాలవిస్తృతి అతని ఎట్టఎదుట ఉన్నది; అందులకు మూలధనముగ ఉపకరించదగు విద్యాధనము అతనిలో ఉన్నది. కావున ఏతాదృశములగువానిని, ఇంతకు మిన్నయగువానిని పలురచనలను వెలువరించి, మానవ సాంస్కృతికవికాసమునకు అతడు ఎంతయో తోడ్పడగలడను ఆశాభావమును వెల్లడించుటకన్న ఒక వర్ధిష్ణురచయిత నుండి కోరదగునది వేరే ఏముండును!

6—12—68

చీమకుర్తి శేషగిరిరావు

# నే చెప్పేది వినరూ?

—శ్రీధరబాబు

మానవ విజ్ఞాన మందిరం
6_12_1968
మాక్స్‌మూలర్ జన్మదినోత్సవ సందర్భాన

1967 సం॥లో ఒక రోజున నా జర్మన్ సోదరుడూ, హైదరాబాదులోని మాక్స్‌మూలర్ భవనం డైరక్టరూ అయిన డా॥ యూర్గన్ ఉలావ్‌తో ఏదో పిచ్చాపాటీ మాట్లాడుతూ ఉండగా ఒక మంచి భావం స్ఫురించి అతనితో ఇలా అన్నాను___" ఢిల్లీ, మద్రాసుల మాక్స్‌మూలర్ భవనాలు హిందీలోనూ, తమిళంలోనూ జర్మన్‌సంస్కృతిని భారతీయ పాఠకులకు తెలియజెప్పే కొన్ని గ్రంథాలు ప్రచురిస్తున్నాయి. హైదరాబాదు మాక్స్‌మూలర్‌భవనం కూడా తెలుగులో అటువంటి గ్రంథాలు ప్రచురించవచ్చుకదా!"అని. ఇలాఅంటే అతడు "బాగుంటుంది" అని అన్నాడు. దానికి సమాధానంగా వెంటనే - "మాక్స్‌మూలర్‌ను గురించి నేనొక గ్రంథం తెలుగులో వ్రాస్తాను. దానితో ఈ కార్యక్రమానికి ప్రారంభోత్సవం చేద్దాం" అని నేనన్నాను. ఆ గ్రంథరచన సాగింది. చిత్తుప్రతి 1968 ప్రారంభమాసాలలోనే తయారైంది. ఇక ప్రచురణ బాధ్యత, అంతకముందే డా॥ ఉలావ్ దాన్ని మాక్స్‌మూలర్‌భవనం తరుపునే ప్రచురించడానికి సంకల్పించి, అ ప్రచురణకయ్యే ఖర్చుల నిమిత్తం కొంత మొత్తం మంజూరు చేయవలసినదని జర్మనీ మూల కేంద్రాన్ని అభ్యర్థించాడు. కాని వాళ్ళు నిధులఇబ్బందివల్ల ఈ అభ్యర్థనను ఈ యేటికి మన్నించలేమన్నారు. అప్పుడు డా॥ ఉలావ్ ___"గ్రంథ రచన అయిందికదా. ఎవరైనా పేపరు ఉచితంగాఇచ్చి సహకరిస్తే నేను మిగిలిన ఖర్చులు భరిస్తాను. మనం అలా పుస్తకం బయటకు తెద్దాం.'' అని అన్నాడు. "సరే'' అన్నాను.

నాకు ఆత్మీయులు ప్రస్తుతం నా వేదపరిశోధనాకార్యక్రమానికి గ్రంథాలు సమకూర్చడంలో, అన్ని సదుపాయాలు కలిగించడంలో ఆర్ద్రంగా చేయూతనిస్తున్న గోల్డెన్ ప్రెస్ అధిపతీ, వ్యవహారజ్ఞుడూ అయిన శ్రీరామస్వామి గారికి ఈ విషయం చెప్పాను. "ముద్రణకు అవసరమయ్యే పేపరు అంతా నేను ఇస్తాను. పని శుభప్రదంగా పూర్తి చేయండి'' అని శ్రీరామస్వామి అన్నారు. తర్వాత గ్రంథం సాపు ప్రతి వ్రాశాను. పేపరు శ్రీరామస్వామి అందించారు. జర్మన్ తమ్ముడు డా॥ ఉలావ్ మిగిలిన సద్దుబాట్లు అన్నీ చేశాడు. 'నాగార్జున ప్రింటింగ్ వర్క్స్' వారు ముద్రించారు. 'నాగార్జున ప్రింటింగ్ వర్క్స్' అధిపతి శ్రీ నారాయణ, ఈ ప్రెస్‌లో వేయాలనే సంకల్పాన్ని బలిష్ఠంచేసిన తెలుగు భాషా సమితి వ్యవహర్త శ్రీ యార్లగడ్డ అంజనేయులు, కృష్ణాపత్రిక సంపాదకవర్గంలో నేను ఉన్నప్పుడు అప్పటి నా సహచరుడైన ప్రస్తుతం ఈ ప్రెస్‌లో పనిచేస్తున్న శ్రీ పుండరీకాక్షుడు, తదితర ప్రెస్ సిబ్బందీ బాగా తోడ్పడ్డారు. ముఖ పత్రాన్ని, లోపలి బ్లాకులను గోల్డెన్ ప్రెస్‌వారు ముద్రించి ఇచ్చారు. శ్రీ రామస్వామిగారి సూచనలవల్ల, దగ్గరఉండి పని జాగ్రత్తగా చేయించిన శ్రీ అనంతరావు కృషివల్ల ఇంత అందంగా అవి తయారైనాయి ముఖపత్రాన్ని అందంగా తయారు చేసి ఇచ్చాడు నా ఆప్తమిత్రుడు శ్రీ శీలా వీర్రాజు ఈ గ్రంథం ఈ రూపంలో రావడానికి ఇందరి సహకారం ఉంది.

ఇంకొక విషయం. గ్రంథరచనా సమయంలో సూచనలు చేసిన వారు నా పూజ్య మిత్రులు శ్రీ ఈయుణ్ణి వీర వెంకట రాఘవాచార్యులు గారు, శ్రీ చీమకుర్తి శేషగిరిరావుగారు.రచన ఒక దశకు వచ్చిన తర్వాత "బాగుంది ముందుకు సాగండి" అని హృదయపూర్వకంగా ప్రోత్సహించినవాడు నా తమ్ముడు ఇబ్రాహీం శరీఫ్. సాపు వ్రాసిన తర్వాత నా రచనలన్నిటిని చదివేవంతు నా చెల్లెలు రాజ్యలక్ష్మిది. ఈ గ్రంథం విషయంలో కూడా ఆమె ఈ పని నిర్వహించింది. ప్రెస్‌కు పంపేముందు సాపు ప్రతి తయారైనతర్వాత ఆయాఅధ్యాయాలు సుప్రసిద్ధకవి నా అంతరంగికమిత్ర(శ్రీ) శ్రీ బోయి భీమన్న విన్నాడు. ఒక అధ్యాయం ముద్రణకు

ఇచ్చేముందు మందాకినీ పత్రికాధిపతులు శ్రీ మరుపూరు కోదండ రామరెడ్డి గారు విన్నారు. "బాగుంది నాయనా" అన్నారు. అంకితంగా ఈ రచన స్వీకరించండి అని కోరితే ఆనందంగా డా॥ ఉలావ్, శ్రీమతి ఉలావ్ అంగీకరించారు. 'ఆప్తవాక్యం' వ్రాసి ఇచ్చారు తెలుగు భాషా సమితి విజ్ఞాన సర్వస్వ సంగ్రాహకులు, నాకు ఆప్తులు శ్రీ చీమకుర్తి శేష గిరిరావు గారు. ఇంతమంది సాన్నిహిత్యం ఈ గ్రంథానికి నేపథ్యంలో ఉంది.

ఇంకొక విషయాన్ని చెప్పాలి. మానవ విజ్ఞానమందిరం తరుపున ఈ గ్రంథాన్ని వెలికి తెచ్చినా, ఈ గ్రంథ విక్రయ పంపిణీ బాధ్యతల నన్నిటినీ స్వీకరించింది ఆంధ్ర సారస్వత పరిషత్. ఈ స్వీక రణలో శ్రీ దేవులపల్లి రామానుజరావు గారి సహకారం ఉంది. రచయిత లకు ఏదో రీతిగా తన శక్తికి తగినట్లు సహకరించాలనే ఆశయం వారి హృదయంలో మెదులుతూ ఉంటుంది.

ఈ గ్రంథరచన జరుగుతున్నప్పుడు అవసరం అయిన పుస్తకా లన్నీ సమకూర్చిన స్టేట్ సెంట్రల్ లైబ్రరి లైబ్రరియన్ శ్రీ టి వి. రమణయ్య గారు ఎంత సహకరించారో చెప్పలేను. స్టేట్ లైబ్రరిలో నా పరిశోధనలకు ఒక రూము ప్రత్యేకించి, సహకరించిన సహృదయులు ఆయన. పరిశోధకులంటే అంత ప్రీతి ఆయనకు, కృతజ్ఞతా పారిజాతాల కన్నా నేనేమి అందించగలను ఆయనకు ?

ఈ రచనావ్యాసంగంలో మాక్స్‌మూలర్ స్వీయగ్రంథాలు. ఎ. ఎ. మాక్డొనల్, జె హెచ్. ఫాగ్ట్, ఆర్.కె. దాస్‌గుప్త మొదలగువారి ముఖ్య రచనలు పరిశీలించడం జరిగింది.

మాక్స్‌మూలర్ విశ్వపౌరుడు. ఆయనను గురించి నా గ్రంథమే చెబుతుంది. ఇంకా ఆయనను గురించి ప్రత్యేకంగా ఈ సందర్భంలో చర్చించను. ఇవాళనే మాక్స్‌మూలర్ జన్మదినోత్సవం. ఈ తరుణంలో ఈ గ్రంథప్రచురణ పూర్తికావాలని అనుకొన్నాం. అయింది. ఇక చదవండి.

*   *   *   *



# అంకితం

జాతివిభేదానికి మతవైవిధ్యానికి అతీతమైన మానవతామకరందాన్ని చవిచూపిన నా జర్మన్ సోదరుడు డా॥ యూర్గన్ ఉలావ్‌కు అతని జీవిత భాగస్వామిని శ్రీమతి హైడె ఉలావ్‌కు ఈ రచన ఆప్యాయత నింపుకొన్న హృదయంతో అందిస్తున్నా......

—శ్రీధరబాబు

# జీవన కథనం

భారత దేశ మిత్రుడుగా భారతీయమతమైన వైదికమతాన్ని భారతీయ సంస్కృతికి జీవస్థానమగు సంస్కృత భాషనూ అధ్యయనం చేసినవాడు మాక్స్ మూలర్. ఈ అధ్యయనంలో మాక్స్‌మూలర్‌కు లక్ష్య శుద్ధితో కూడిన ఒక అచంచల విశ్వాసం ఉంది. ఆ విశ్వాసంలో ఉన్మాదం లేదు. భారతీయ చరిత్ర ప్రపంచ రీతులతో శ్రుతి కలుపుకొని విశాల దృక్పథంతో పరిశీలించిన పండితులు అరుదు. మాక్స్‌మూలర్ మహాశయుడు మతం, భాష, ఇతిహాసం, పురాణం – ఈ రంగాలలో చేసిన తులనాత్మక వివేచన విశాల ప్రపంచ చారిత్రక దృక్పథానికి దారి అయింది. భారతదేశం బ్రిటీష్ పాలనలో ఉన్న కాలంలో ఇంగ్లండులోని ఆక్స్‌ఫర్డులో నివసిస్తూ అటు ఇంగ్లీషువారికి భారతీయులపట్ల ఆదర గౌరవాలు, ఇటు భారతీయులకు అనాదికాల గత స్వీయ వైదిక సంస్కృతి పట్ల ప్రీతి జనించేటట్లు ఆ 19వ శతాబ్దంలో ప్రోత్సాహ పరచినవాడు మాక్స్‌మూలర్. ఋగ్వేద సంపుటాలను ప్రప్రథమంగా సంశోధించి వెలుగులోనికి తెచ్చి, వేద సంస్కృతిని అవగాహన చేసుకోవాలనే జిజ్ఞాసువులకు సేద తీర్చాడు. అదేకాక అవెస్తా, ఉపనిషత్తులు, ఖురాన్ మొద

లగు అనేక ప్రాగ్దేశ మత గ్రంథాల అనువాద పరంపరకు సంపాదకుడై విశ్వమత సమన్వయ వేదికను తయారు చేసినవాడు మాక్స్‌మూలర్.

మాక్స్‌మూలర్ జర్మనీదేశంలో 1823 సం॥ డిశంబరు 6వ తేదీన డెసావూ నగరంలో ఉదయించాడు. ఆయన తండ్రి ఒక సుప్రసిద్ధ జర్మను కవి. ఆయన పేరు విల్ హెల్మ్ మూలర్. తల్లి అడెల్ హేడ్. ఆమె అన్ హాల్ట్ డె సావూ అనేచిన్న రాజ్యానికి ప్రధాన మంత్రి ప్రసిడెంట్ ఫన్ బాసడోవ్ కూతురు కొడుకు పుట్టిన నాలుగేళ్ళకే అంటే 1827 సం॥ లో మాక్స్‌మూలర్ తండ్రి విల్ హెల్మ్ పరలోక గతుడయ్యాడు. అందువల్ల చిన్నారి మాక్స్‌మూలర్ తల్లివద్దనే పెరిగాడు. అక్షరాభ్యాసం అయిన తర్వాత డెసావూ పట్టణంలోని గ్రామర్ స్కూలులో 1836 సం॥ వరకు చదివాడు. బుద్ధి తెలిసేందుకు ముందే తండ్రి కాలధర్మం చెందినా తండ్రి నుండి వారసత్వంగా లభించిన కొన్ని లక్షణాలు మాత్రం మిగిలి ఆ ఏకైక పుత్రునిలో మూర్తీభవించినాయి. విల్ హెల్మ్ మూలర్ మృతి చెందేటప్పటికి ఆయన వయస్సు ముప్పది మూడు సంవత్సరాలు. ఆ స్వల్ప వ్యవధిలోనే విల్ హెల్మ్ సాహిత్యోద్యానంలో ఎన్నో కవితా ప్రసూనాలు పూచినాయి. ఆ రోజులలో జర్మనీ దేశంలో విల్ హెల్మ్ మూలర్ 'గ్రీచెన్ మూలర్' అని ప్రసిద్ధి చెందాడు. 'గ్రీచెన్ మూలర్' అంటే 'గ్రీకు మూలర్' అని అర్థం. ఈ పేరు గడించుకొనడానికి ఒక కారణం ఉంది. 19వ శతాబ్దపు ప్రారంభ దినాలలో గ్రీకులు తమ జాతీయ స్వాతంత్ర్యోద్యమంలో ముమ్మరంగా పాల్గొంటున్న రోజులలో గ్రీకుల సమరాన్ని ప్రోత్సాహ పరుస్తూ అనేక గీతాలు ఈయన రచించాడు. అందులోచాలా గీతాలకు ఫ్రాన్జ్ షూబర్ట్ అనే సుప్రసిద్ధ జర్మన్ సంగీత విద్వాంసుడు స్వరపరచి సంగీత రూపం కల్పించాడు. దానితో విల్ హెల్మ్ గీతాలు, పాటలు జర్మనుల సాంస్కృతిక జీవితంలో ఒక అంతర్భాగంగా పరిగణింపబడుతూ బాగా ప్రచారంలోనికి వచ్చాయి. అంత చిన్న వయస్సులోనే ప్రతిభా సంపన్నుడై గ్రీకులను ఉత్సాహ పరచడమే కాకుండా తన జర్మన్ జాతిని కూడా తన పాటలతో పద్యాలతో రంజింప జేశాడు, డెసావూ అనే చిన్న నగరంలో మిగిలిన ప్రపంచంతో

సన్నిహిత సంబంధాలు పెట్టుకొనేందుకు వీలులేని ప్రదేశంలో ఈ యువకుడు ఉన్నప్పటికీ గ్రీకు విప్లవంలోని సమరగతిని మారుతూన్న స్థానిక సంఘటనలతో సహా ఎలా సూక్ష్మంగా ఆయన గ్రహించగలిగాడా అని మాక్స్‌మూలర్‌ను కూడా తన తండ్రి ప్రతిభా సంపన్నత ఆశ్చర్య చకితుణ్ణి చేసింది. తర్వాత జీవితంలో తండ్రి గీతాలను ప్రచురింప జేస్తూ మాక్స్‌మూలర్ ఆ ప్రచురణకు వ్రాసిన తొలిపలుకులలో ఆ ఆశ్చర్యాన్ని ప్రకటించాడు. విల్‌హెల్మ్‌మూలర్ ఏనాడూ గ్రీసు దేశాన్ని సందర్శించలేదు. అయినా గ్రీసుదేశపు స్వాతంత్ర్య సమరమంటే అద్భుతమైన ప్రీతినీ, అపారమైన సానుభూతినీ ప్రదర్శించాడు. ఈ విషయంలో తండ్రి లక్షణాలు కొన్ని కొడుకుకు ఇలా సంక్రమించాయనవచ్చు. మాక్స్‌మూలర్ భారతదేశాన్ని ఎప్పుడూ సందర్శించలేదు. కాని భారతీయతత్త్వం అంటే ఆయనకున్న ప్రేమ అపారం, భారత ప్రజల అభ్యుదయం అంటే ఆయనకున్న అభిమానం అనల్పం.

మాక్స్‌మూలర్‌కు చిన్నతనంలో సంగీతం అంటే అమితప్రీతి ఏర్పడింది. చిన్నప్పుడు మెండెల్‌సోన్, కార్ల్‌మరియా ఫన్ వీబర్ వంటి సంగీత విద్వాంసశ్రేష్ఠులతో ఆయనకు సాన్నిహిత్యం ఉండేది. అందులో కార్ల్‌మరియా ఫన్ వీబర్ మాక్స్‌మూలర్‌కు మాతామహుడు కూడా. ఆయన మాక్స్‌మూలర్ జన్మకు కొద్దిరోజుల పూర్వమే డెర్‌ఫ్రైష్రిట్స్ (der Freischritz) అనే సంగీత రూపక రచనను సమాప్తి చేశాడు. ఆ సంగీత రూపకంలో 'మాక్స్' అనే వాడు ఒక పాత్ర. ఆ సందర్భాన్ని పురస్కరించుకొని ఆ తరుణంలో కొత్తగా పుట్టిన మనమడికి తాతగారు ముద్దుగా 'మాక్స్' అని పేరు పెట్టారు. మాక్స్‌మూలర్ నామకరణం వెనక కథ ఇది.

చిన్ననాడు మాక్స్‌మూలర్ పెరిగిన వాతావరణాన్ని బట్టి సంగీత కళ ఆయనకు అభిమాన విషయంగా తయారైంది. ఆ లేత పయస్సులో తానొక సంగీతజ్ఞుడూ, వాగ్గేయకారుడూ కావాలని అభిలషించి కలలు కనేవాడు. సంగీతాన్నే జీవిత ధ్యేయంగా చేసికొని వృత్తిగా చేబడదామని

భావించాడు. కాని కుర్రవాని యోగ్యతలను గుర్తించి మెండల్‌స్సాన్ సంగీతాన్ని వృత్తిగా స్వీకరించవద్దని మాక్స్‌మూలర్‌ను వారించాడు. అందుకని సంగీతం వృత్తిగా పెట్టుకోవాలనే ఆకాంక్షను ఆయన ఉపసంహరించుకొన్నాడు. సంగీతం కాకపోతే ఆయన జీవితధ్యేయంగా ఎన్నుకొన్న మరోమార్గం విజ్ఞానార్జన, పరిశోధన. ఆ మార్గన్నే అనుసరించాడు. చిట్టచివరకు విజ్ఞాన వికాసం పొందాడు. విశేష పరిశోధనలు చేసి పండిత ప్రకాండుడైనాడు. తర్వాత తర్వాత శేముషీ వైభవం ఆయన వ్యక్తిత్వంలో ఒక భాగమైంది. పోనీ మాక్స్‌మూలర్ సామాన్య పండితులవంటి నీరసజీవియా అంటే అలానూ కాదు. తన అపార పాండిత్య సంపదకు సరసతను జోడించాడు. రసమకరందాన్ని చిలికే, అనుభవ పరిమళాన్ని వెదజల్లే సుందరాతి సుందర వాక్యాలద్వారా తన జ్ఞానవైభవాన్ని ఆవిష్కరించేవాడు. ఆయన సంగీత రసాస్వాదనాశక్తి రచనా రీతిలో రసమాధుర్యాన్ని రంగరించేటట్లు చేసిందని అనుకోవచ్చు. ఆయన రచనలలోనేకాక ఆయన వాక్కులలో కూడా ఆ సంగీత శక్తి మేళవింపబడి ఉండేది. ఆయన ఉపన్యాసాలలోని తేనెలసోనలు అనేకమంది శ్రోతలను అమితంగా ఆకర్షించేవి అంటే అదే కారణం.

చిన్నప్పుడు మాక్స్‌మూలర్ తల్లివద్ద పెరుగుతూన్నప్పుడే ఆయన రాజకీయ వాతావరణంలో మసలడం అలవాటైంది. ఆయన తాతగారు లుడ్విగ్ ఫన్ బసదోవ్ డెసావూలో జమిందారికి ప్రధానమంత్రి ఆయెను. తన తాతయ్య ఆధీనంలో ఆయనప్రభావఛాయలో పెంచబడటంవల్ల డెసావూలో చిన్ననాటినుండీ రాజాస్థానవాతావరణంలో స్వేచ్ఛగా విహరించడం ఆయనకు అలవాటైపోయింది· ఈ బాల్యానుభవ ప్రభావమే తర్వాత జీవితంలో ఆయన రాజులతో, చక్రవర్తులతో ఉన్నత రాజోద్యోగులతో తన గౌరవానికేమీ లోటురానిరీతిలో వ్యవహరించడానికి అవకాశం కల్పించింది. రాజాస్థాన మర్యాదలకు అనువుగా అతికిపోయే వ్యక్తిత్వాన్ని ఆయనకు ప్రసాదించింది.

మాక్స్‌మూలర్ స్కూల్ చదువుకోసం లిప్జిగ్ నగరానికి వెళ్లాడు. అక్కడ తన తండ్రికి మిత్రుడైన డా॥ కారుస్ (Dr. Carus) అనే

ఆయన కుటుంబంతోబాటు ఉంటూ ఆపట్టణంలోని 'నికొలై షూలె' (Nicolai Schule) అనే పాఠశాలలో ఐదేళ్ళపాటు తన చదువు కొనసాగించాడు. లిప్జిగ్‌లో ఉండగానే ప్రాచీన భాషలను నేర్చుకోవాలని నిర్ణయించుకొన్నాడు. కాని దానికి ఒక పరీక్ష ప్యాసైతేగాని యోగ్యతరాదు. అన్‌హాల్ట్ దెసావూరాజ్యంలోని త్సెర్బ్స్ (Zerbst) అనే చిన్న పట్టణంలో ఆ పరీక్షకు కూర్చొని ఉత్తీర్ణుడయ్యాడు. ఈ పరీక్షలో ఉత్తీర్ణుడు కావడానికి గణితంలో, ఇంకా మరికొన్ని విషయాలలో మంచి పరిజ్ఞానం ఉండాలి. వ్యవధి తక్కువైనా ఈ విషయాలన్నింటిని క్షుణ్ణంగా చదివి ప్రథమశ్రేణిలో ఉత్తీర్ణత పొందాడు. అప్పటికి విశ్వవిద్యాలయంలో ప్రవేశించడానికి అర్హత లభించింది.

1841వ సంవత్సరపు వసంతకాలంలో మాక్స్‌మూలర్ లిప్జిగ్ విశ్వవిద్యాలయంలో ప్రవేశించాడు. అక్కడ సంస్కృత భాషాధ్యయనమే కాకుండా అనేక ఇతర విషయాలు కూడా అభ్యాసం చేశాడు. ప్రాచీన భాషల ఆచార్యులయిన హౌప్ట్ (Haupt) హెర్మన్ (Hermann) బెకెర్ (Becker) వంటి పండితుల ఉపన్యాసాలేకాక, ప్రాచీన జర్మన్ భాష, హిబ్రూ అరబిక్ భాషలు, మనస్తత్వ శాస్త్రం, మానవశాస్త్రం— వీటిని గురించిన తరగతులకూ ఆయన హాజరయ్యేవాడు.

లిప్జిగ్ విశ్వవిద్యాలయంలో 1841 వ సంవత్సరంలో సంస్కృత భాషాశాఖను నూతనంగా ప్రారంభించారు. అక్కడ సంస్కృత భాషా విభాగానికి మొదటి ఆచార్యుడుగా హెర్మన్ బ్రొఖౌస్ (Hermann Brockhaus) ఎన్నుకోబడ్డాడు. హెర్మన్ మహాశయుడు మాక్స్‌మూలర్‌ను సంస్కృతభాషను బాగాఅధ్యయనం చేయవలసిందిగా ప్రోత్సహించాడు. తత్ఫలితంగా సంస్కృతభాషాభ్యసనానికీ, భాషాశాస్త్రాధ్యయనానికీ ఉత్సాహంతో పూనుకొన్నాడు ఆయన. సంస్కృతభాష అంటే ప్రీతి ఏర్పడటమే కాకుండా ఆ భాషలో అవిరళంగా తీవ్రకృషి చేశాడు. అప్పటికి ఆయనకు ఇరవై సంవత్సరాల వయస్సు. ఆ వయస్సులోనే "హితోపదేశమ్" అనే సంస్కృతగ్రంథాన్ని జర్మన్ భాషలోకి అనువదించాడు. ఈ అనువాదం లిప్జిగ్‌లోనే 1841 సంవత్సరంలో ప్రచురితమైంది.

అధ్యయన వ్యాసంగంలో ఆయనకు మొదటనుండీ తత్వజిజ్ఞాస ఒక ప్రక్కన తీవ్రంగా ఉండేది. అందుకనే ఈ విశాలవిశ్వంలో మానవునికున్న స్థానాన్ని గుర్తించి మీమాంసించి అర్థంచేసుకోవాలనే జిజ్ఞాస బాగా ఆయనలో కన్పిస్తుంది. చరిత్రకు అందని ప్రాచీన యుగాలనుండి మానవజాతి సంస్కృతి వికసనాన్ని సమీక్షించుకోవాలనే ఆకాంక్ష ఆయనలో ఉవ్వేలా వెలిగింది. పి. హెచ్. డి. డిగ్రీపొందడానికి వ్రాయవలసిన పరిశోధనా వ్యాసానికి ఆయన తాత్వికవిషయాన్నే ఎన్నుకున్నాడు. ఫ్రెంచి తత్వవేత్త స్పినోజా నీతిశాస్త్రసిద్ధాంతాలను గురించి పరిశోధించాడు. దానికి ఫలంగా 1843 సెప్టెంబర్ 1వ తేదీన డాక్టరేట్ పట్టాన్ని పొందాడు. ఆ పట్టాన్ని పొందిన తర్వాత కూడా మరో సెమెస్టర్ పాటు లిప్జిగ్‌లోనే గడిపాడు.

1844 సం॥ వసంతకాలంలో మాక్స్‌ముల్లర్ బెర్లిన్ నగరానికి వెళ్ళాడు. అక్కడ ఫ్రాన్జ్‌బొప్ ఫ్రెడరిచ్ ఫన్ షెల్లింగ్‌ల పర్యవేక్షణ క్రింద భాషాశాస్త్రం, తత్వశాస్త్రం అధ్యయనం చేశాడు. ఫ్రాన్జ్‌బొప్ తులనాత్మక భాషాశాస్త్రానికి ప్రథమ ప్రవర్తకుడు. షెల్లింగ్ సుప్రసిద్ధుడయిన తత్వవేత్త. భాషను శాస్త్రీయ దృక్పథంతో అధ్యయనం చేయడంలో ఆయనమీద ఫ్రాన్జ్‌బొప్‌ప్రభావం బాగా పడింది. జీవితమంతా భాషావిషయిక పరిశోధనను ఆయన విడిచిపెట్టలేదు. తర్వాత అక్స్‌ఫర్డులో ఉన్న 32 సంవత్సరాలూ భాషాపరిశోధన ఆయనను అంటిపెట్టుకొనే ఉంది. భాషల మధ్య సాదృశ్యాలెన్నో ఉన్నాయి. ముఖ్యంగా ఇండో–యూరోపియను భాషల మధ్యగల పోలికలను గుర్తించడం మాక్స్‌ముల్లర్‌కు లిప్జిగ్‌లో ఉండగానే అలవాటైంది. అయన లిప్జిగ్ విశ్వవిద్యాలయంలో ఉన్న కాలంలోనే ఈ కృషి సాగుతున్నది. సంస్కృతభాషలో 'అస్మి' అనే పదానికి అర్థం 'నేను ఉన్నాను' అని. గ్రీకు భాషలో ఇదే అర్థాన్ని సూచించే పదం 'ఎస్మి'. ఎలా వచ్చింది ఈ పోలిక? ఇలా పోలికలు గల విభిన్న భాషల పదాల పట్టికలను తయారు చేశారు ఆనాటి ఐరోపా ఖండపు పండిత ప్రకాండులు. ఆ రోజులలో కొంతమంది 'ఏథెన్సులోను, రోములోను నివశించే ప్రజలకు, భారతదేశంలో ఉన్న నీగ్రోలకు భాషా

విషయంలో సాదృశ్యం ఏమిటి?' అని అవిశ్వాసాన్ని ప్రకటించేవారు. ఈ విషయాన్ని మాక్స్‌మూలరే 'భారతదేశం: అది మనకు నేర్పేది ఏమిటి?' అన్న గ్రంథంలో ఒకచోట చెబుతాడు. ఫ్రాన్జ్ బొప్ ఈ భాషా సాదృశ్యాల ఆధారంగా సంస్కృతం, జెండ్, గ్రీకు, లాటిన్, గోథిక్ భాషల తులనాత్మక వ్యాకరణం ప్రచురించినప్పుడు పండితులు కూడా అపహాస్యం చేశారట. లిప్జిగ్‌లో స్కూలులో చదువుతూన్నప్పుడు ఒక సంఘటన జరిగింది. లిప్జిగ్ స్కూలులో ఒక మధ్యాహ్నం జరిగిన ఉదంతమిది. మాక్స్‌మూలర్ అధ్యాపకుడు డా॥ క్లీ (Dr. Klee) ఆ మధ్యాహ్నం ఎండ తీక్ష్ణంగా ఉండటంవల్ల సీరియస్‌గా పాఠం చెప్పడం మొదలుపెట్టక భాషలను గురించి తేలిక మాటలతో చెబుతూ భారతదేశంలో గ్రీకు, లాటిన్, జర్మన్, రష్యనులకు ఏమాత్రం తీసిపోని ఒక భాష ఉన్నదని చెప్పాడట. ఆ మాటవినంగానే మొదట్లో మాక్స్‌మూలర్‌తో సహా క్లాసులోని పిల్లలంతా అదేదో హాస్యానికి మాష్టారు అలా చెబుతున్నారని అనుకొన్నారు. కాని 'బ్లాక్ బోర్డు' మీద మాష్టారు సంస్కృతం, గ్రీకు, లాటిన్ భాషల మధ్య సాదృశ్యాలను తెలియపరిచే అంకెల, సర్వనామాల, క్రియాపదాల పట్టికలను ఇచ్చేటప్పటికి ఎదురుకుండా కొట్టవస్తున్నట్లు కన్పిస్తున్న సత్యాలను ఆనాడు ఆ తరగతిలోని విద్యార్థులు చూచి ఆశ్చర్యపోయారు.

బెర్లిన్‌లో ఉన్నప్పుడు షెల్లింగ్ ఉపన్యాసాలవల్ల ఆయనతాత్త్విక జిజ్ఞాస ఇనుమడించింది. షెల్లింగ్ ఉపన్యాసాలు వింటూన్నప్పుడు ఆయనలో కొన్ని సంశయాలు రేకెత్తేవి. ముఖ్యంగా షెల్లింగ్ ప్రాగ్దేశపు మతాలను గురించి వెల్లడించిన అభిప్రాయాల సత్యత్వాన్ని మాక్స్‌మూలర్ శంకించాడు. షెల్లింగ్ ప్రాగ్దేశపు మతాలను తక్కువచూపు చూచేవాడు. తర్వాత కొన్నాళ్ళకు ఒకసారి ఫ్రాంక్‌ఫుర్టు నగరంలో షోపెన్‌హోర్ అనే ప్రసిద్ధ తత్త్వవేత్తతో చేసిన చర్చలవల్ల ఈవిషయంలో ఇంకాఎన్నో కొత్త సంశయాలు ఆయనలో ఉత్పన్నమైనాయి. షోపెన్‌హోర్ తత్త్వసిద్ధాంతమంతా ఉపనిషత్తుల భావనలమీద ఆధారపడిఉంది. అందుకని ఆయన వేదంలోని ముఖ్యభాగాలు ఉపనిషత్తులేనని, మిగిలిన వేదభాగాలన్నీ పౌరోహితుల ఊకదంపుడు వ్యవహారమని విమర్శించాడు. ఈ విమర్శ మాక్స్

మూలర్‌కు కువిమర్శగా తోచింది. షోపెన్‌హోర్ ఆలోచనాపద్ధతి లోపభూయిష్టం అని నిరూపించి, వేదంలోని మిగిలినభాగాలలో ముఖ్యంగా మంత్రభాగంలో అపారజ్ఞాన సంపద ఉన్నదని లోకానికి ఎలుగెత్తి చాటాలని నిర్ణయించుకొన్నాడు. ఆ ఆశయసిద్ధికి శేషజీవితంలో బాగా కృషి చేశాడు కూడా.

1845 సం॥ మార్చినెలలో మాక్స్‌ముల్లర్ పారిస్ నగరానికి పయనించాడు. అక్కడ యూజెన్‌బర్నోఫ్ (Eugene Burnouf) ప్రభావం ఆయనమీద బాగా ప్రసరించింది. యూజెన్‌బర్నోఫ్ ఆకాలంలో సంస్కృత భాషలో గొప్ప విద్వాంసుడుగా ప్రసిద్ధికెక్కడమే కాకుండా, జరతూష్ట్రమత పవిత్రగ్రంథమగు 'అవెస్తా' ను క్షుణ్ణంగా విమర్శనగా చదివిన ప్రామాణిక పండితుడుగా కూడా గౌరవింపబడేవాడు. పారిస్‌లో ఉన్నప్పుడు రూడోల్ఫ్‌రోత్ (Rudolf Roth) మాక్స్‌మూలర్ సహాధ్యాయి. రూడోల్ఫ్‌రోత్ వైదికభాషాశాస్త్రానికి ఆదిలో ఒక రూపునిచ్చిన మనీషి. అక్కడనే మరో సహాధ్యాయి డాక్టర్ థియోడోర్ గోల్డ్‌ష్టుకర్ (Dr. Theodore Goldstucker). ఇతడూ సంస్కృత భాషలో మహా విద్వాంసుడుగా విఖ్యాతి చెందాడు. అలా సంస్కృతభాషా ప్రీతిని మరింతగా వికసింపజేసే మిత్రబృందం మధ్య జిజ్ఞాసా పథాన మాక్స్‌మూలర్ ముందుకు సాగి, తన స్వల్పకాలపు పారిస్ జీవితాన్ని సఫలీకృతంచేసుకొన్నాడు. పారిస్‌లో ఉన్నప్పుడే యూజెన్‌బర్నోఫ్‌మహాశయుడు మాక్స్‌మూలరును ఋగ్వేదాన్ని అధ్యయనం చేయమనీ, ఋగ్వేదాన్ని మొదటిసారిగా ముద్రించడానికి పరిష్కృతప్రతిని సంసిద్ధం చేయమనీ, అలా చేస్తే పరిశోధనా రంగానికి ఎంతోఎనలేని సేవచేసిన వాడవౌతావనీ ప్రోత్సహించాడు. ప్రప్రథమంగా ఋగ్వేద ముద్రణకు కావాల్సిన వ్రాతప్రతులు సేకరించుకొనమని ఉపదేశించాడు. గురువర్యుడైన యూజెన్‌బర్నోఫ్ మహాశయుని సందేశాన్ని శిరసావహిస్తూ ఆర్యజాతికి ప్రప్రథమ పవిత్ర గ్రంథమగు ఋగ్వేదపు వ్రాతప్రతులను పరిశీలించడం ప్రారంభించాడు. అనేక తాళపత్ర ప్రతులను సేకరించాడు. ఒకదానితో మరొకదానిని పోల్చి అర్థం చేసుకొనడానికి పూనుకొన్నాడు. ఋగ్వేదాన్ని సాయణాచార్యుల భాష్యంతో

సహా ఉన్న అనేక ప్రతులను పరిశీలించే ఈ కృషిలో నిమగ్నుడై ఉన్న ప్పుడు తన జీవితయాత్ర గడుపుకొనడంకోసం చాలా శ్రమించవలసి వచ్చేది. నాలుగువేళ్ళూ నోటిలోపలకు పోయేందుకు కావాల్సినవారికి వ్రాత ప్రతుల కాపీలను తయారుచేసి ఇచ్చేవాడు. కాదా పండితులకు ఇతరత్రా సహకారాలు అందించి, తద్వారా కూడా ధనాన్ని ఆర్జించేవాడు. ఋగ్వే దాన్ని సాయణభాష్యంతో సహా చక్కగా పరిశోధించి ప్రచురించేఏర్పాటు చేయాలనే ఆశయం ఆయనలో గాఢంగా నాటుకొన్నది.

ఋగ్వేదాన్ని ప్రచురింపజేసే ఆశయాన్ని సిద్ధింపజేసుకొనడానికి 1846 సం॥ జూన్ నెలలో ఇంగ్లండుకు తరలి వెళ్ళాడు. లండన్ వెళ్ళే ముందు అక్కడున్న ప్రష్యా రాయబారి బారన్ బున్సెన్‌కు ఒక పరిచయ లేఖను తీసి కొని వెళ్ళాడు. లండన్ నగరంలో బున్సెన్ మహాశయుడు మాక్స్ మూలర్‌ను ఆప్యాయతతో ఆదరించాడు. తర్వాత జీవితంలో బారెన్ బున్సెన్‌మహాశయుడు మాక్స్‌మూలర్‌కు అత్యంతఆప్తుడూ, అంతరంగిక మిత్రుడూ అయ్యాడు లండనులో ఋగ్వేద ప్రచురణ ఆశయ పరిపూర్తికి బున్సెన్ మహాశయుడేగాక అక్స్‌ఫర్డులోని సంస్కృత విభాగాధినేత హొరేస్ హెమెన్ విల్సన్‌కూడా ఎంతో సహకరించారు. బున్సెన్, విల్సను లిద్దరూ ఈష్టిండియా కంపెనీ నిధులతో ఋగ్వేద ప్రచురణ సమగ్రంగా జరగాలని కంపెనీ డైరెక్టర్లకు నచ్చజెప్పారు. ఈగ్రంథ ప్రచురణ మానవ జాతి వికసన చరిత్ర అవగాహనలో, అధ్యయనంలో ఎన్నెన్నో నూతన పరిశోధనలకు అవకాశం కల్పిస్తుందని వారి గుండెలకు నాటేటట్లు చెప్పి, చివరకు వారిని ఒప్పించగలిగారు. వారి కృషి ఫలితంగా ఈష్టిండియా కంపెనీ ఋగ్వేద సంపుటాలను సమగ్రంగా భాష్యంతోసహా పరిష్కరించి ప్రచురించే బాధ్యతను మాక్స్‌మూలర్‌కు వప్పగించింది.

లండన్‌లో ఉన్న ఆ రోజులలో మాక్స్‌మూలర్ బున్సెన్ మహాశ యునితోబాటు 1847 సం॥ జూన్ నెలలో ఒకసారి అక్స్‌ఫర్డును సంద ర్శించాడు. అక్కడ బ్రిటిష్ ఎసోసియేషన్ వారి ఆహ్వానాన్ని పురస్కరిం

చకొని బెంగాలీ భాషను గురించీ, దానికీ మిగిలిన ఆర్య భాషలకూ ఉన్న సంబంధ బాంధవ్యాలమ గురించీ ప్రసంగించాడు.

1848 సంవత్సరప్రారంభంలో ఋగ్వేద లిఖిత ప్రతులను సమీక రించుకోనడానికి పారిస్ మరలి వచ్చాడు. అదే సమయంలో ఫ్రాన్సులో విప్లవ జ్వాల రేగింది. మాక్స్‌మూలర్ తాను సేకరించిన వ్రాతప్రతులు, తాళపత్ర గ్రంధాలు ఆ విప్లవాగ్నిలో పడి దగ్ధమైపోతాయేమోనని భయపడ్డాడు. అమూల్యములైన ఆ వ్రాతప్రతులను తీసికొని భద్రతకోసం హుటాహుటీని లండన్‌కు తిరిగి వెళ్ళాడు లండన్ తిరిగి వచ్చిన తర్వాత బున్సెన్‌తోబాటు లార్డ్ పామర్‌స్టన్ (Lord Palmerston) వద్దకువెళ్ళి విప్లవం రాజుకొనగానే ఫ్రెంచిరాజు లూయీ ఫిలిప్పి ఫ్రాన్సు ముఖ్య పట్టణమగు పారిస్‌ను ఎలా విడిచి పారిపోయాడన్న వార్తను, తదితర విప్లవ విశేషాలను మొదటగా నివేదించిన వాడు మాక్స్ మూలర్.

పారిస్ వెళ్ళి లండన్‌కు తిరిగి వచ్చిన తర్వాత ఋగ్వేద ప్రథమ సంపుటాన్ని ప్రచురణకు సంసిద్ధ పరచడానికి పూనుకొన్నాడు. ఋగ్వేదాన్ని ఆక్స్‌ఫర్డు యూనివర్సిటీ ప్రెస్‌వారు ముద్రించడానికి ఏర్పాట్లు జరిగాయి. మొదటి సంపుటాన్ని ముద్రణకు సిద్ధపరచిన తర్వాత ప్రెస్ పనిమీద తరచు ఆక్స్‌ఫర్డుకు వెళ్ళవలసివచ్చేది. దాని మూలకంగా సౌలభ్యంకోసం లండన్ నుండి ఆక్స్‌ఫర్డుకు తప్పని సరిగా మకాం మార్చవలసి వచ్చింది. 1848 సం॥ మేనెలలో అక్కడకు తరలివెళ్లాడు. అలా అప్పటినుండి జీవితాంతంవరకు ఆక్స్‌ఫర్డు ఆయనకు స్థిరనివాసమైంది. ఆక్స్‌ఫర్డులో ఉంటూ తన నిరంతర కృషి ఫలితంగా ఋగ్వేద ప్రథమ సంపుటాన్ని సాయణభాష్యంతో పరిష్కరించి, 1849 సం॥ లో వెలుగులోనికి తేగలిగాడు; ప్రథమ సంపుటంలో ఆయన ఋగ్వేదంలోని ప్రథమాష్టకాన్ని మాత్రమే అందీయగలిగాడు. ఋగ్వేదాన్ని గురించి ఆయన చేసిన ప్రత్యేకకృషి ఇరువదిఐదు సంవత్సరాలు తీసుకొన్నది. ఆయన ఋగ్వేద సంపుటాలను పరిష్కరించి వెలికి తెచ్చే కేవల పరిష్కర్తగానే ఋగ్వేదాన్ని అధ్యయనం చేయలేదు. అదేకాక కేవలం భాషా శాస్త్రజ్ఞుడుగా భాషాదృష్టితోనే ఋగ్వేద మంత్రాలను ఆయన పరిశీలించనూ

లేదు. ఋగ్వేదాధ్యయనవిషయంలో ఆయన లక్ష్యం ఇంకా ఉన్నతోన్నత మైంది అతి ప్రాచీనమైన ఆర్య సంస్కృతి వైభవాన్ని వెలువరించే మహత్తర జ్ఞానభాండారం ఋగ్వేదం అనే గౌరవ భావంతో, చారిత్రక దృక్పథంతో ఒక క్రమాన్ని అవలంబించి అధ్యయనం చేశాడాయన. భాష, భాషలోని పదాలు, ఆ పదాలకు అన్యభాషా పదాలకుగల సాదృశ్యాలు ఇవన్నీ మొదట్లో ఆయనను ఆకర్షించినా, తన పరిశోధనాక్రమం వికసిస్తున్నకొద్దీ ఆయన అధ్యయనంలో తత్త్వదృష్టి వెల్లివిరిసింది.

ఋగ్వేదాన్ని ప్రచురించడానికి ఈష్టిండియా కంపెనీవారు ఒప్పుకొన్నారని చెప్పడానికి ఒక రోజున బున్సెన్‌మహాశయుడు తన ఇంటికి మాక్స్‌మూలర్‌ను పిలిపించాడు. మాక్స్‌మూలర్ రాగానే తన లైబ్రరీ గదిలోనికి ఆయనను పిలవనంపి, అక్కడ ఈష్టిండియా కంపెనీ వారి నిర్ణయాన్ని తెలియజేశాడు. బున్సెన్ ఈష్టిండియా కంపెనీ డైరెక్టర్లను చాలా రోజులబాటు చాలాసార్లు కలిశాడు, ఋగ్వేద ప్రయోజన ప్రాధాన్యాన్ని, అది ఇంగ్లండులో ప్రచురింపవలసిన ఆవశ్యకతనూ వారికి ఎంతగానో వివరించాడు. ఆయన ప్రయత్నాలు ఫలించాయి. ఆకృషి ఫలించినట్లు మాక్స్‌మూలర్‌తో చెప్తూ బున్సెన్ ఇలా అన్నాడు— "మాక్స్ ముల్లర్ ! జీవితమంతా వెచ్చించి చేయవలసిన పని నీ కిప్పుడు లభించింది. ఈ పని ఎలాంటిదంటే ఒక పెద్ద శిలామూర్తిని ఏళ్ళ తరబడిగా నునుపు చేస్తూ తీర్చి దిద్దడంవంటిది. అయినా ఇది గుర్తుంచుకో. ఈ బృహత్తర కార్యక్రమ నిర్వహణే కాకుండా అప్పుడప్పుడూ నీ వైజ్ఞానిక కర్మాగారం నుండి చిదపలు చిదపలుగా కొన్ని జ్ఞాన శకలాలు కూడ అందీయాలి సుమా!" ఆప్తమిత్రుడిచ్చిన ఈ సలహాను తుచ తప్పకుండా పాటించాడు మాక్స్‌మూలర్. ఋగ్వేదానికి సంబంధించిన పని ఒక ప్రక్క చేస్తూనే ప్రతియేటా ఎన్నో వ్యాసాలు, అప్పుడప్పుడూ కొన్ని గ్రంథాలూ వెలువరించేవాడు. అందులో చాలా వ్యాసాలు "ఎడింబరో", "క్వార్టర్లీ రివ్యూస్" "ఆక్స్‌ఫర్డు ఎస్సేస్" "మాక్మిలన్ పత్రిక", "ఫ్రాజర్స్ పత్రిక", "సన్డే రివ్యూ" "టైమ్స్" వంటి సంచికలలో ప్రచురింపబడుతూ ఉండేవి. బున్సెన్ చెప్పిన మరో హితోక్తి కూడా మాక్స్‌మూలర్ హృద

యంలో సిరపడిపోయింది. బున్సెన్ మాక్స్‌మూలర్ ఎన్నటికీ మరచిపో లేని ఒక మహత్తర సందేశాన్ని ఇలా అందించాడు— "నాయనా! ఒక గనినుండి ముడిసరుకు వెలికి తీసికొని రావడంతోనే నీ పని అయిపోయిందని భావించరాదు. ఆముడిసరుకును జాగ్రత్తగా పరిశీలించాలి. తర్వాత కరిగించాలి; పరిశుద్ధ పరచాలి; ఆ తర్వాత పోతపోయాలి. అప్పుడూ అది ఉపయోగానికి వస్తుంది. ఈ దృష్టితో మానవాళిలోని వైజ్ఞానిక క్షుధార్తులకు విందుచేసి నీ రచనలతో కడుపునింపు" బున్సెన్ మాటలలోని శక్తి మాక్స్‌మూలర్‌కు వంట పట్టింది. ఆయన రచనలలో ఆ సందేశసారం ప్రతి ఫలిస్తుంది కూడా. తనకు ఆత్మీయుడగు బున్సెన్ మహాశయుని పేరును చిరస్మరణీయం చేయడానికి తన "జర్మన్ కర్మాగారం నుండి మచ్చు తునకలు" [Chips from German work shop] అనే పేరుతో వెలువరించిన వ్యాసాల ప్రథమసంపుటాన్ని ఆయనకు అంకితం చేశాడు. బున్సెన్ స్మృతి చిహ్నంగా అందజేసిన అంకిత వాక్యాలలో—"నా స్నేహితునకూ నా శ్రేయోభిలాషికీ ఇది అంకితంగా ఇస్తున్నాను" అని మిత్రుణ్ణి ఆర్ద్రంగా మాక్స్‌మూలర్ స్మరించాడు.

ప్రథమంగా విడుదల చేసిన ఋగ్వేద సంపుటాలు అన్నీ అమ్ముడై పోయినాయి. ఋగ్వేదసంపుటాలు అయిపోవడంతో భారతదేశంలోని మాక్స్‌మూలర్ మిత్రులు ప్రాచీన వేదవిజ్ఞానం అవగతం చేసికోవాలనే పునర్జాగృతి దశలో ఋగ్వేద సంపుటాలు దొరకకపోవడం ఒక వెలితిగా ఉన్నదని, మరోముద్రణ తీసికొనిరావడం అవసరం అని పదే పదే సూచిస్తూ వచ్చారు. అప్పటికి భారత దేశంలో ఈష్టిండియా కంపెనీ పెత్తనం అంతమై పోయింది. Secretary of State for India కు తిరిగి పరిష్కరించి ఋగ్వేదం రెండో ముద్రణ తీసుకువస్తాననీ, భారత ప్రభుత్వం ముద్రణకయ్యే ఖర్చులు పెట్టుకొంటే, తన కాలాన్ని వినియోగించి మిగిలిన పనులన్నీ నిర్వహించడానికి తాను ఏమీ ఆశించకుండా ఉచితంగా శ్రమిస్తానని వ్రాశాడు. అప్పటి సర్కారువారు దానికి అంగీకరించలేదు అలా అప్పుడు అంగీకరించకపోవడం తన ప్రాణానికి ఒక రకంగా తెరిపి అయినట్లైందని భావించాడు మాక్స్‌మూలర్. కొంత మంది భారతీయులు

భారతదేశంలోనే ఈ సంపుటాలు తిరిగి ముద్రించడానికి అవకాశం ఇవ్వమని సూచించారు. కాని మాక్స్‌మూలర్‌కు ఈ సూచన నచ్చలేదు. యోగ్యుడైన పండితునికి అయితే యీపని వప్పగించి ఉండేవాడిని కాని, అసలు తాను చేయించాలనుకొన్న మార్పులు, చేర్పులు ఏవీలేకుండా కేవలం పాత సంపుటాలనే తిరిగి ముద్రించడంతో ప్రయోజనం ఉండదని ఆయన భావించాడు కొత్త తాళపత్ర ప్రతులు లభ్యపడటం మూలాన కొత్తగా జత చేర్చవలసినవి కూడా ఉంటాయి ఆయెను ఇలా రెండో ముద్రణ విషయంలో ఆలోచన సాగుతూ ఉండగా ఆంధ్ర దేశంలోని విజయనగరం మహారాజా ఆనంద గజపతి, ఋగ్వేద ద్వితీయ ముద్రణకు ఖర్చు 4000 పౌన్లు విరాళంగా యిచ్చాడు, ఇది మాక్స్‌మూలర్‌కు ఎంతో ఆనందాన్ని కల్గించింది. ఇతరత్రా ఉన్న ఎన్నో పనులు మాను కొని ఋగ్వేద సంపుటాల రెండో ముద్రణకు ఏర్పాటు చేయడం ప్రారంభించాడు. రెండో ముద్రణ ఉపోద్ఘాతంలో ఆయన ఇలా వ్రాశాడు—

"The Princely and truely patriotic liberality of His Highness The Maharajah of Vijayanagaram has enabled me to take up once more in the evening of my life that work which has occupied me during my youth and during my advancing years"

విశ్వవిద్యాలయ విద్య ముగించుకొని విశాల విశ్వంలో అడిగిడిన తరుణంలోనే సంస్కృత సాహిత్య అధ్యయనానికి ఆధారశిల వేదం అని అని మాక్స్‌మూలర్‌కు అర్థమైంది. అందుకు ఆయన భాష్య సహితంగా ఋగ్వేద సంపుటాలు వెలువరించాలనే ప్రతిజ్ఞ చేబట్టాడు. ఇది తనకు శక్తికి మించిన పని అయినప్పటికీ దయార్ద్ర హృదయులైన స్నేహితుల సహకారంతో 1849 సం॥ నుండి 1873 సం॥ వరకు అంటే రమారమి ఇరువై ఐదు సంవత్సరాలు వరకు శ్రమించి తానీ కృషిలో కృత కృత్యుడ నయ్యానని ఆయన అంటాడు, ఆయన కాలంనాటి ప్రముఖ పండితులంతా ఈ కృషికి హృదయపూర్వకమైన ప్రోత్సాహాన్ని అందించారు. ఆయన ఇన్నేళ్లగా పడిన కష్టం ఏమాత్రం వృధా పోలేదు, ఆ కష్టానికి తగినట్లు

ఋగ్వేద సంపుటాలు వెలుగుచూడటంతో ఉచితగౌరవాన్ని పొందా నని ఆయన అంటాడు. ఈ విషయాన్ని గురించి రెండో ముద్రణ ముందు మాటలలో ఆయన అన్న మాట లివి__"... I may say it now with out conceit, I have been fully rewarded by the results which it has produced'' రెండో ముద్రణ తీసుకొని రావడంలో ఆచార్య బ్యూలర్ (Prof Buhlar) శిష్యుడైన డా॥ వింటర్‌నిట్జ్ సహకారం ఆయనకు బాగా లభించింది. రెండో ముద్రణకు ప్రతిసంసిద్ధపరచడంలో కొత్తగా దొరికిన వ్రాతప్రతులను అనుసరించి, క్రొత్తగా ప్రచురింపబడిన గ్రంథాలను అనుసరించి మార్పులు చేసి పరిష్కరించడంలో డా॥ వింటర్‌నిట్జేగాక స్టాంగ్ అనే ఆయన కూడా మాక్స్‌మూలర్‌కి బాగా సహకరించాడు.

ఆక్స్‌ఫర్డులో ఉంటూ ఋగ్వేద సంపుటాల ప్రచురణలో మునిగి ఉన్నా జీవయాత్ర సాఫీగా నడవడానికి ఏదో ఉద్యోగం మాక్స్‌మూలర్‌కు అవసరమైంది అందుకనే 1850 సం॥లో ఆక్స్‌ఫర్డు విశ్వవిద్యాలయంలో ఆధునిక యూరోపియను భాషల శాఖకు డిప్యూటీటేలోరియన్ ప్రొఫెసర్‌గా నియమిస్తే ఆ ఉద్యోగంలో ఆనందంగా చేరాడు. ఆ ఉద్యోగంలో చేరిన మరుసటి సంవత్సరంతోనే గైస్‌ఫోర్డు (Gaisford) అనే 'డీన్' సూచనపై విశ్వవిద్యాలయంనుండి 'మాష్టర్ ఆఫ్ ఆర్ట్సు' గౌరవ పట్టాను పొంది యోగ్యతను పెంచుకొన్నాడు. అదేకాక క్రీష్ట్ చర్చిలో సభ్యుడుగా స్వీకరించుకోబడ్డాడు కూడా. 1854 సం॥లో డిప్యూటీ ప్రొఫెసర్ పదవి నుండి పై మెట్టు ఎక్కి ఆ ఆధునిక యురోపియను భాషల శాఖకు టేలోరియన్ ప్రొఫెసర్ అయ్యాడు. టేలోరియన్ ప్రొఫెసరుగా ఆయన ముఖ్యంగా జర్మన్ ఫ్రెంచి భాషను, జర్మన్ భాషా మాండలికాలను, వాటి స్వరూప స్వభావాలను బోధించే కోర్సులను నిర్వహించేవాడు. 1856 సం॥ లో ఆక్స్‌ఫర్డు బోడిలియన్ లైబ్రరికి క్యూరేటర్‌గా ఎన్నుకోబడ్డాడు. ఈ పదవిని ఊపిరిసలపని మిగిలిన కార్యక్రమాలతోబాటు 1863 సం॥ వరకునిర్వహించాడు. మళ్లీ అదే పదవికి 1881 సం॥ లో ఎన్నుకోబడ్డాడు. చివరకు 1894 సం॥ లో ఆ పదవినుండి పూర్తిగా విర

మించు కొన్నాడు. 1858 సం॥ లో 'All souls college' కి జీవిత పర్యంత విశిష్ట సభ్యుడుగా ఎన్నుకోబడి గౌరవింపబడ్డాడు.

1859 సం॥ లో మాక్స్‌మూలర్ వివాహితుడయ్యాడు. రివెర్స్ డేల్ మహాశయుని కూతురు జార్జియనా అడెలైడ్ అనే ఆంగ్ల వనితను పరిణయమాడాడు. అప్పటికి ఆయన వయస్సు ముప్పది ఐదు సంవత్సరాలు. అలా ఆంగ్లవనితను వివాహం చేసుకొనడంవల్ల ఇంగ్లీషు వాతావరణానికి తగినట్లు కలిసిమెలసి పోవడానికి ఆయనకు అవకాశం కలసి వచ్చింది. మాక్స్‌మూలర్ జీవితాంతం వరకు తన శ్రీమతితో ఇంగ్లండులో ఆక్స్‌ఫర్డులోనే కాపురం చేశాడు. ఆ దంపతులకు ముగ్గురు ఆడపిల్లలు, ఒక మగపిల్లవాడు కలిగారు. జ్యేష్ఠపుత్రిక కొంతకాలం జీవించి డ్రెస్డెన్‌లో (Dresden) 1876 సం॥ లో దేహం చాలించింది. రెండో కూతురు ఆక్స్‌ఫర్డు విశ్వవిద్యాలయ కళాశాల విశిష్ట సభ్యుడైన కొనిబియరెను (F. C. Conybeare) వివాహమాడింది. భర్త తో 1886 సం॥ వరకు కాపురంచేసి ఆమె దివంగతురాలైంది. మూడో అమ్మాయిని సర్ జేన్స్ రామ్‌కెన్ ఫెర్గూసన్ జేష్ఠపుత్రునకు ఇచ్చి పెండ్లి చేశారు. కొడుకు W. G. మాక్స్ మూలర్‌కూడా గొప్పగా విద్యావంతుడై బ్రిటీషు వారి రాయబార కార్యాలయాలలో అనేక చోట్ల పని చేశాడు. 1900 సం॥ నాటికి మాక్స్‌మూలర్ కొడుకు అమెరికాముఖ్యపట్టణమైన వాషింగ్‌టన్ లోని బ్రిటీష్‌రాయబార కార్యాలయంలో ద్వితీయ కార్యదర్శిగా (Second Secretary) పనిచేస్తూ ఉండేవాడు. ఆ తర్వాత కూడా స్పెయిన్‌లోనూ మరికొన్ని చోట్లా బ్రిటీష్ రాయబార కార్యాలయాలలో ఉన్నత పదవులను అధిష్ఠించాడు.

వివాహం జరిగిన యేటనే మాక్స్‌మూలర్ "ప్రాచీన సంస్కృత సాహిత్య చరిత్ర" అనే తన ముఖ్య గ్రంథాన్ని వెలువరించాడు. ఇందులో వేదకాలంలోని సంస్కృత సాహిత్య కృషిని గురించి ప్రధానంగా చర్చించాడు. ఆయన పరిశోధనాప్రాభవం ఈ గ్రంథంలో ఎంతగానో ప్రతిబింబించింది. ఆనాటికి ఇంకా ప్రచురితంకాని తాళపత్రాల రూపంలో ఉన్న

అనేక గ్రంథాలను పరిశోధించి రూపొందించిన గ్రంథమిది. ఈ సంస్కృత భాషా చరిత్రలో భాషా శాస్త్ర పరిశీలన ఒక విధానంగా వినియోగించుకొంటూ మానవేతిహాస ప్రారంభవిశేషాలను సమీక్షించుకొనడానికి అవకాశం ఉందని నిరూపించాడు. ఆర్యులు అనేక శాఖలుగా చీలి, ప్రపంచంలో అనేక ప్రాంతాలలో ఆవాసాలు కల్పించుకొన్నారు. విభిన్న వాతావరణాలలో విభిన్న భాషలను రూపొందించుకొన్నారు. ఆవిభిన్న భాషలలలోని పద సాదృశ్యాలను గురించి అప్పటికే ఫ్రాన్జ్ బోప్ వంటి జర్మన్ పండితులు కృషిచేస్తున్నారు. వారి కృషిఫలంగా ఇండో యూరోపియనుభాషల మధ్యగల సామ్యాలను కనుక్కోడం జరిగింది. దానిమూలానఈ భాషలన్నిటికి ఏదోమరో మూలమాతృభాష ఉన్నదనేభావన పండిత లోకంలోకొంత ప్రచారంలోనికి వచ్చింది. మాక్స్‌మూలర్‌కు ఆనాటి సర్వభావధారలతోనూ విస్పష్ట పరిచయం ఉంది. సంస్కృత భాష ఇండోయూరోపియన్ భాషలన్నిటికన్నా అతి ప్రాచీనమైంది కనుక ఆ భాషాధ్యయనం వల్ల ఇండో యురోపియన్ ఆర్య మూల పురుషులను గురించి తెలుకొనేందుకు వీలు పడుతుందని మాక్స్‌మూలర్ విశ్వసించాడు. ఒక ప్రక్క గ్రీసు సంస్కృతి మరో ప్రక్క భారతీయ సంస్కృతి రెండు ప్రధాన ఆర్య సంస్కృతీ శాఖలుగా విస్తరిల్లి వికసించాయని ఆయన భావించాడు

1860 సం॥ మే నెలలో ఆక్స్‌ఫర్డు విశ్వవిద్యాలయంలోని సంస్కృత భాషాచార్యుడు హోరేస్ హేమెన్ విల్సన్ దివంగతుడయ్యాడు దానితో అక్కడ సంస్కృత భాషాచార్య పదవి ఖాళీ అయింది. మాక్స్‌మూలర్ ఆ పదవిని అధిష్ఠించాలని అభిలషించాడు తాను ఇదివరకు ప్రచురించిన రచనలనుబట్టీ, తన విశిష్టమైన సంస్కృతభాషా వైదుష్యాన్ని బట్టీ అన్ని విధాలా ఆ పీఠాన్ని అధిరోహించడానికి అర్హుడైనవాడే. అయినా ఆయన ఈ పదవిని ఆశించిన మరో ప్రత్యర్థిని ఎదుర్కోవలసి వచ్చింది. ఆ ప్రత్యర్థి సర్ మానియర్ విలియమ్స్. ఈయన బలియర్‌లోను, యూనవర్శిటీ కాలేజస్‌లోను చాలా కాలంనుండి సభ్యుడుగా ఉన్నవాడు. హైలెబరీలోని (Haileybury) ఈష్టిండియా కాలేజీలో పనిచేస్తూ ఆ కాలేజీనుండి 1858 సం॥లో పూర్తిగా విరమించుకొనేవరకు సంస్కృతభాషాచార్యుడుగా

అక్కడనే ఉన్నాడు. ప్రత్యర్థికన్నా అన్నిఅవకాశాలూ, అర్హతలూ మాక్స్‌మూలర్‌కు ఉన్నమాట నిజమే. చాలామంది ఆ పదవికి మాక్‌మూలరే ఎన్నుకోబడతాడని ఆశించిన మాట కూడా నిజమే కాని వారు ఆశించిన రీతిగా ఆయన ఆ పదవికి ఎన్నుకోబడలేదు. అసలు ఎన్నిక అంతా యూనివర్శిటీ కాన్వకేషన్ చేతుల్లో ఉంది. ఈ కాన్వకేషన్‌లోని సభ్యులంతా అభ్యర్థుల సంస్కృతభాషా వైదుష్యాన్ని బట్టి కాకుండా రాజకీయ మతవిషయాలకు ఎక్కువ ప్రాధాన్యమిచ్చి ఈ ఎన్నిక జరిపారు. అందులో మాక్స్‌మూలర్ ఇంగ్లీషువాడు కాదు. జర్మనీ నుండి ఇంగ్లడుకువచ్చి స్థిరపడిన విదేశీయుడు. అదేకాక క్రైస్తవ మతాన్ని గుడ్డిగా అంటిపెట్టుకొనే మత విశ్వాసి కూడా కాడాయన. ఆయన మత సంబంధములైన భావనలు విశాల దృక్పథంతో ఉండేవి ఈ కారణాలన్నీ మాక్స్‌మూలర్‌కు వ్యతిరేక వాతావరణాన్ని సృష్టించాయి. పైగా కాన్వకేషన్‌లో వోటు వినియోగించుకొనడానికి వచ్చిన వారిలో అనేక మంది సభ్యులు ముఖ్యంగా పల్లెపట్టులనుండివచ్చినక్రైస్తవ మతాచార్యులు. వారి మనస్సులపై పైవ్యతిరేకత మరింతగా పని చేసింది. మొత్తానికి 1860 సం॥ డిశంబరు 7వ తేదీన జరిగిన ఎన్నికలలో మానియర్ విలియమ్స్ 223వోట్ల మెజారిటీతో ఆ పదవికి ఎన్నుకోబడ్డాడు.ఆ ఎన్నికలలో మాక్స్‌మూలర్‌కు 610 వోట్లు వస్తే మానియర్ విలియమ్సుకు 833 వోట్లు వచ్చాయి అలా ఆ ఎన్నిక మాక్స్‌మూలర్‌కు వ్యతిరేక ఫలితాన్ని ఇచ్చింది. ఇది ఆయన జీవితంలో ఒక చేదు అనుభూతి. ఇది రేఖా మాత్రంగా ఆయనలో ఆశాభంగాన్ని కల్గించినా ఆయనలో సంస్కృత భాషాప్రీతిని పోగొట్టలేదు. ఆ రంగంలో ఆయన కృషితీవ్రతను చెదరగొట్టలేదు. సంస్కృతభాషకు మానియర్ విలియమ్స్ కన్నా ఎన్నోరెట్ల సేవ జీవితాంతం వరకు నిజంగా ఆయన చేస్తూనే వచ్చాడు. ఈ సంఘటనవల్ల ఆయన జీవితాశయాలలో కొంత మార్పు వచ్చింది. అప్పటికి ఇరవై సంవత్సరాల నుండి సంస్కృత భాషా పరిశోధనలోనే నిమగ్నుడైవున్నాడు. ఒకవేళ సంస్కృత శాఖలో ఆచార్య పీఠాన్నే ఆయన అలంకరించిఉంటే తన అభిమానవిషయంకోసం సర్వకాల సర్వావస్థలలోను

కృషి సాగించి ఉండేవాడు. అలా జరగకపోవడం మూలాన ఆయన మేధా కేదారం వైజ్ఞానికంగా తదితర రంగాలలో మేలి పంటలు వెలయించ గలిగింది. ఒకవేళ సంస్కృతాచార్యుడే అయి ఉన్నట్లయితే ఆయన ఇంత కీర్తి పతాకను ఎగరవేసి ఉండేవాడు కాదేమోనని ఆయన వద్దనే శిక్షణ పొందిన మాకొనల్ పండితుడు కూడా భావించాడు. నిజంగా అలానే జరిగింది. శేష జీవితంలో మాక్సుమూలర్ శక్తిసామర్ధ్యాలు, పరిశ్రమ శీలత అనేక శాస్త్రరంగాలలో రాణించినాయి.

ఆ తర్వాత మాక్సుమూలర్ భాషాశాస్త్ర పరిశోధనలు సాగించాడు. ముఖ్యంగా తులనాత్మక భాషాశాస్త్రవిషయిక (Comparitive Philology) సంశోధనలపై దృష్టినిలిపి చాలాపనిచేశాడు రాయల్ ఇన్‌స్టిట్యూషన్‌లో 1861 సం॥లో, 1863 సం॥లో ఆయన భాషాశాస్త్ర ప్రసంగాలు చేశాడు. దానివల్ల ఈ విషయాలలో ప్రామాణికుడైన పండితుడని ఇంగ్లండులో ప్రసిద్ధి లభించింది. ఆయన అప్పుడు చేసిన ప్రసంగాలలో ప్రతిపాదించిన భాషాసిద్ధాంతాలు నేడు ప్రామాణికాలు కాకపోయినా, అప్పుడు మాత్రం ఆయన భావనలు సమకాలీన పండితులలో ఉత్తేజాన్ని కలిగించినాయి. సరళమైన శైలిలో ఆయన తన భావాలను వ్యక్తీకరించడం మూలాన పండితులనే కాక పామరులను కూడా అవి ఆకర్షించేవి.

1865 సం॥ లో బొడిలియన్‌వద్ద ప్రాగ్దేశాల సంబంధ విషయ నిర్వహణకు ఉపలైబ్రేరియన్‌గా నియమింపబడ్డాడు. కాని ఆయన బహుముఖ కార్యక్రమాలకు ఆ పదవికీ పొత్తు కుదరలేదు. అందుకని రెండు సంవత్సరాలపాటు ఉండి ఆ పదవినుండి విరమించు కొన్నాడు.

1868 సం॥ లో అంతవరకూ మాక్సుమూలర్ అక్స్‌ఫర్డులో అధిష్ఠించిఉన్న టేలరియన్ ఆచార్య పీఠాన్ని ఖాళీచేశాడు వెంటనే తన కోసమే స్థాపింపబడిన తూలనాత్మకభాషా శాస్త్రశాఖలో ఆచార్యపీఠాన్ని అధిరోహించాడు. ఆ పదవిలో ఆయన జీవితాంతంవరకూ ఉన్నాడు. కాని 1875 సం॥ నుండి ఆ పదవీబాధ్యతలను ఎక్కువగా పట్టించుకోకుండా మిగిలిన కార్యక్రమాలలో వివిధ విధాలుగా కృషిచేస్తూ వచ్చాడు.

తులనాత్మక భాషాశాస్త్ర పీఠాన్ని అధిరోహించి, ఆ శాఖకు ఆక్స్ ఫర్డులో ఆచార్యుడైన నాలుగు సంవత్సరాల పిమ్మట ఒక సంఘటన జరిగింది. జర్మనీదేశంలో కొత్తగా అప్పుడే నెలకొల్పిన స్ట్రాస్‌బుర్గ్ విశ్వవిద్యాలయంవారు అక్కడ సంస్కృత శాఖలో ఆచార్య పదవిని అలంకరింపవలసిందిగా ఆహ్వానించారు. కాని మాక్స్‌మూలర్ ఆ ఆహ్వానాన్ని అంగీకరించక, ఆక్స్‌ఫర్డులోనే జీవితకాలంఅంతా గడిపివేయడానికే నిర్ణయించుకొన్నాడు. అయినా 1872 సం॥ లో స్ట్రాస్‌బుర్గ్ యూనివర్శిటీ ఆహ్వానాన్ని ఆమోదించి, ఆ సంవత్సరపు వేసవికాలంలో కొన్ని ఉపన్యాసాలివ్వడం మూలాన తనను గౌరవించి ఇచ్చిన ధనాన్ని ఆయన తిరిగి ఆ యూనివర్శిటీ అధికారులకే వప్పగించాడు. వారేమో "మాక్స్‌మూలర్ ఉపకారవేతనము" అనే పేరుతో ఒక బహుమానాన్ని సంస్కృత భాషా వైదుష్యాన్ని ప్రదర్శించిన విద్యార్థులకు ఇవ్వాలని నిర్ణయించుకొని, ఆ ధనాన్ని సద్వినియోగం చేశారు.

మాక్స్‌మూలర్ ఇంగ్లండులో తులనాత్మకభాషావలోకానికి ప్రాతిపదిక వేసిన మూలపురుషుడు కావడమేకాక తులనాత్మకంగా దేశదేశాల పురాణాలను, మతాలను వివేచించే పద్ధతికి ప్రారంభకుడై ఆంగ్ల వైజ్ఞానికలోకంలో ఉత్తేజం కలిగించిన మహామేధావి. ముఖ్యంగా తులనాత్మక పౌరాణికగాధావివేచన అప్పటికే జర్మన్‌దేశస్తుడు అడల్‌బెర్ట్‌కున్ (Adalbert Kuhn) ("Die Herabkunft de Fevers") అనే గ్రంధాన్ని 1849సం॥లో ప్రచురించి ప్రారంభించాడు. మాక్స్‌మూలర్ ఆకృషిని మరింత తీవ్రంగా కొనసాగించి ఇంకా ముందుకు తీసికొనిపోయాడు. 1856 సం॥లో వివిధదేశాల పౌరాణిక గాధల సాదృశ్యాలను వివరించే వ్యాసాన్ని ప్రథమంగా ప్రకటించాడు. 1897 సం॥ వరకు చాలా వ్యాసాలు వ్రాసి ప్రచురిస్తూ ఈ రంగంలో కృషిచేస్తూనే ఉన్నాడు. ఈయన పౌరాణిక గాధలను పదాల సాదృశ్యాలను ఆధారంగా చేసికొని, వాటి మధ్య పోలికలను పరిశీలించే విధానాన్ని అవలంబించాడు. ఈ విధానాన్ని హర్షించే పండితులు నేడు చాలా అరుదు. అయినప్పటికీ ఆయన రచనలు మున్ముందు

ఆ రంగంలో కృషిసాగించినవారికి ఉత్సాహశక్తిని పూరించినమాట వాస్తవం.

పురాణ గాథల సాదృశ్యాల వివేచనకన్నా ఆయన మతాలమధ్య గల సాధర్మ్యాలపై తులనాత్మకంగా చేసిన పరిశోధన చాలా విలువైంది. ఇప్పటికీ ఈ రంగంలో ఆయన పరిశోధించి వెలువరించిన కొన్ని భావనలను కొందరు పండితులు శిరసావహిస్తున్నారు. మతాన్ని శాస్త్రీయ పద్ధతిలో అధ్యయనం చేయాలనే దృక్పథంతో 18'0 సం॥ లో రాయల్ ఇన్‌ష్టిట్యూషన్‌లో ఆయన కొన్ని ప్రసంగాలు చేశాడు. అప్పుడు ప్రారంభించిన ఆ కృషి ఆయన జీవితాంతం వరకు ముప్పది సంవత్సరాలుదాటు అవిరళంగా సాగింది. 1873 సం॥ డిశంబరు మాసంలో డీన్‌స్టాన్లీ ఆహ్వానంపై వెష్టమినిష్టర్ ఎబ్బేలో "మిషన్స్" అనే పేరున ప్రపంచ మతాలన్నింటిని పరామర్శిస్తూ ఒక ఉపన్యాసం ఇచ్చాడు తర్వాత 1888 సం॥ నుండి 1892 సం॥ వరకు గ్లాస్కో యూనివర్శిటీలో "గిఫర్డ్" ఉపన్యాసాలు చేశాడు.

ఆక్స్‌ఫర్డులోని తులనాత్మక భాషాశాస్త్ర ఆచార్య పీఠానికి సంబంధించిన బాధ్యతలనుండి చురుకుగా పనిచేయడం మాక్స్‌మూలర్ 1875సం॥ లోనే విరమించుకొన్నాడు. ఆ యేటనే ప్రాగ్దేశ పవిత్ర గ్రంథాల పరంపరను (Sacred Books of the East) తన సంపాదకత్వ పర్యవేక్షణ క్రింద ప్రచురించే బృహత్ప్రథకాన్ని ఆయన చేబట్టాడు. ఆ మహామేధావి పాండిత్య ప్రకర్షకు నికషోపలంగా నిలిచే అనేక రచనలు ఆచార్యపదవికి చెందిన తన బాధ్యతలను సడలించుకొన్న తర్వాతనే ఆయన కలంనుండి ధారాళంగా వెలువడసాగాయి. ప్రాగ్దేశ పవిత్ర గ్రంథాల ఆంగ్లానువాదాల సంపుటాల ప్రచురణకు ప్రణాళిక సిద్ధపరచడం, సంపాదకత్వ బాధ్యత నిర్వహించడం ఒక మహాయజ్ఞంగా నిర్వహించాడాయన. ఆ పరంపరలోని ఉపనిషత్తుల సంపుటాలు రెండు, దమ్మపదపు సంపుటం ఒకటి తనే అనువదించి ప్రచురింపజేశాడు. మరో రెండు సంపుటాలలోని చాలా పాళ్ళ అనువాదం ఆయనే సాగించి ప్రచురణకు సమర్పించాడు. ఈ ప్రాగ్దేశ

పవిత్ర గ్రంధ పరంపర 'Sacred Books of the East' అనే పేరిట ప్రసిద్ధ పండితుల ఆంగ్ల అనువాదాలను ఆక్స్‌ఫర్డు యూనివర్శిటీ ప్రెస్సు వారు ప్రచురించారు. క్రైస్తవ మతేతర పవిత్ర గ్రంథాలను ఇలా ప్రచురించడంవల్ల తులనాత్మకంగా చారిత్రక దృష్టితో మతాలను అధ్యయనం చేయడానికి ఒక భూమిక తయారుచేయబడినట్లయింది. తర్వాత పండితుల కృషికిది మహోపకారం చేసింది ఈ గ్రంథాలలో ఉపనిషత్తులు, భగవద్గీత, అవెస్తా, ఖురాన్ వంటి ప్రాచ్య పవిత్రగ్రంధాలే కాక ప్రాచీన ధర్మశాస్త్ర గ్రంథాలను ముఖ్యంగా మనువు, ఆపస్తంబుడు మొదలైనవారి ధర్మశాస్త్ర రచనలను కూడ అనువదించి వెలువరించారు. దానితో భారతదేశపు ధర్మశాస్త్రానుగుణమైన శాసనాలను, ఆచార వ్యవహారాలను మిగిలిన ప్రపంచం అర్ధంచేసుకోడానికి వీలు ఏర్పడింది. ఈ సంపుటాలు మొత్తం ఏబై ఒక్కటి. ఒక్క ఆఖరు సంపుటం విషయసూచిక సంపుటం తప్పితే మిగిలినవన్నీ సంపాదకుడైన మాక్స్‌మూలర్ పర్యవేక్షణలోనే ఆయన జీవితకాలంలోనే ప్రచురింపబడ్డాయి. వీటిల్లో దాదాపు ముప్పది సంపుటాలు భారతదేశపు పవిత్ర గ్రంథాల అనువాదాలే. అందులో వైదిక మతానికి, బౌద్ధానికి, జైనానికిచెందిన గ్రంథాలు సంస్కృత పాళీ ప్రాకృత భాషలనుండి అనువదింపబడ్డాయి. ఇవేకాక చీనా, అరబ్బీ, పహ్లవీగ్రంథాల అనువాదాలు కూడా ప్రచురింపబడ్డాయి. ఈ బృహత్ప్రథకం తలబెట్టి తరతరాలుగా ఒక మహత్తర మత సమన్వయ దృష్టిని అలవర్చుకోవలసినదని ప్రబోధంచేసి మానవాళి మరువలేని మహత్తరకృషి చేశాడు మాక్స్‌మూలర్. ఈ గ్రంథాల విశిష్టత, కాలంపరీక్షలో కూడా నిగ్గుతేరింది. ఐక్యరాజ్యసాంస్కృతిక వైజ్ఞానిక సంస్థ (UNESCO) ఈ గ్రంధాలనన్నిటిని 1965 సం॥ లో మళ్ళీ ప్రచురించడానికి పూనుకొని సహకరించడమూ, వారణాసి నుండి 'బనారసీలాల్ మోతీలాల్' వారు ప్రచురించడమూ ఇందుకు తార్కాణం.

1860 సం॥లో జరిగిన బోడెన్ సంస్కృతాచార్య పీఠానికి జరిగిన ఎన్నికలలో మాక్స్‌మూలర్ ఎన్నిక జరగకపోయినా, ఆక్స్‌ఫర్డు విశ్వవిద్యాలయంలో ఆయన సంస్కృత విభాగానికి ప్రాతినిధ్యం వహించక

పోయినా సంస్కృత భాషలో ఆయన కృషి ఎన్నడూ కుంటుపడలేదు. సంస్కృతభాషకు ముఖ్యంగా ఋగ్వేద సంహితను సాయణభాష్య సహితంగా ప్రచురింపజేసి చేసిన సేవ ఎనలేనిది ఋగ్వేద సంపుటాల మొదటి ముద్రణ 1873 సం॥లో పూర్తి అయింది. ఆ సంపుటాలు తిరిగి పరిష్కరింపబడి రెండో ముద్రణగా 1892 సం॥లో వెలువడ్డాయి. ఋగ్వేద సంహిత ప్రథమ సంపుటం 1849 సం॥లో వెలువరించినప్పుడు, ఆ సంపుటం యొక్క మొదటి పుటలో ఈ క్రిందివిధంగా ఆయన ప్రచురించాడు—

"ఋగ్వేద సంహితా
సాయణాచార్య విరచిత మాధవీయ వేదార్థప్రకాశ
నామక భాష్యసహితా
జార్మణ్య దేశోత్పన్నేన ఇంగలణ్డదేశనివాసినా
భట్టమోక్షమూలరేణ సంశోధితా
శ్రీ మద్భారత వర్షాధిపతీనామను మత్యాచ
ఉక్షతరణాభిధాన నగరే
విద్యామందిర సంస్థాన ముద్రాయంత్రాలయే ముద్రితా"

పై సంస్కృత వాక్యాలలో మాక్స్‌మూలర్ తన పేరును "భట్ట మోక్షమూలరేణ" (భట్ట = పండితుడగు, మోక్షమూలరేణ = మోక్ష మూలరునిచేత) అని ప్రయోగించి, తన పేరుకు సంస్కృతభాషా రూపం ఇచ్చాడు. అలా చేసిన సంస్కృతీకరణంలో మాక్స్‌మూలర్ మోక్ష మూలరు భట్టు అనే నామాంతరంలో ప్రత్యక్షమయ్యాడు. ఆయన సంస్కృత భాషాభిమానం అట్టిది!

ఈ ఋగ్వేద సంహిత సంపుటాల ప్రచురణకు ఆర్థిక వనరులు కల్పించిన ఈస్టిండియా కంపెనీ మేజర్- జనరల్ సర్ అర్చిబాల్డ్ గాలోవేకు (Sir Archibald Galloway), మిగిలిన డైరెక్టర్లకూ ఈ సంపుటాలు అంకితం ఇచ్చాడు. అసలు ప్రథమ సంపుటాన్ని తీసుకొని

వచ్చేముందు 6 సం॥రాలబాటు సాయణాచార్య భాష్యసహితమైన ఋగ్వేద లిఖిత ప్రతులను పరిశీలించి పరిష్కరించాడు. జర్మనీలో పబ్లిక్ లైబ్రరీ లలో ఋగ్వేద లిఖిత ప్రతులు లేవు. బెర్లిన్‌లో 'రాయల్ లైబ్రరి' లో మాత్రం అతి ప్రాచీన ఋగ్వేద లిఖితప్రతులు సాయణ భాష్య సహితంగా ఉన్నాయి. కాని కీటకదష్టములైనాయి. అందుకని బెర్లిన్‌లోకన్నా ఋగ్వేదప్రతులు ఎక్కువగా ఉన్న పారిస్ నగరంలో, లండన్ నగరంలో అక్స్‌ఫర్డులో ఆయన ఈ విషయంలో ఎక్కువకృషి సాగించాడు. అనేక తాళపత్ర గ్రంథాలను పరిశీలించి ముఖ్యమైనవాటికి కాపీలు కూడా ఆయన తయారు చేసుకొన్నాడు.

మాక్స్‌మూలర్‌కు పూర్వం ఋగ్వేద ప్రచురణకు డా॥ రోజెన్ అనే ఆయన పూనుకొన్నాడు. కాని కృతకృత్యుడు కాలేకపోయాడు. మాక్స్‌మూలర్ ఈ కృషిలో పూర్తిగా సఫలత పొందాడు. దానికి కారణం ఆయన అన్నివైపులనుండి ప్రోత్సాహాన్ని అందుకొనడమే. ఋగ్వేద ప్రథమ సంపుట పీఠికలో ఇటువంటి సహకారం అందించినవారిలో అలెగ్జాండర్ ఫన్ హుమ్బోల్ట్, ప్రొఫెసర్ ఇ. బొర్నాఫ్, చావలియర్ బున్సెన్, ప్రొఫెసర్ హెచ్. హెచ్. విల్సన్‌లను ముఖ్యులుగా ఆయన పేర్కొన్నాడు.

మాక్స్‌మూలర్ ఆర్యగ్రంథావళి ప్రచురణగా ఎనెక్డొటా అక్స్ సీన్సియా (Anecdota Oxoniensia) అనే పేరిట నాలుగు గ్రంథాలు ప్రచురించాడు. అవేకాక దేహయాత్ర చాలించక పూర్వమే మరో మూడు గ్రంథాల ప్రచురణలో ఆయన తన శిష్యులకు చేయూతనందించాడు.

అక్స్‌ఫర్డులో అడుగిడిన ప్రాగ్దేశ విద్వాంసులెవరైనా ఆయన ప్రభావ పరిధిలోనికి అడుగిడేవారు. ఆ పండితులకు వారివారికి తగిన పరిశోధనా కార్యక్షేత్రాలను గురించి ఆయన సముచితమైన సూచనలు చేసే వాడు. సంస్కృత భాషా గ్రంథాల అనువాదాల ప్రచురణేకాక తన సంస్కృత భాషాధ్యయన సారంగా రూపొందిన స్వీయభావనలను గ్రంథాలుగా, వ్యాసాలుగా ప్రకటించాడు. అనేక సందర్భాలలో ఉపన్యాసా

లుగా ఇచ్చారు. ముఖ్యంగా 1883 సం॥లో కేంబ్రిడ్జి విశ్వవిద్యాలయంలో "భారతదేశం : అది మనకు నేర్పేది ఏమిటి?" అన్న పేరున చేసిన ప్రసంగాలలో సంస్కృతభాషా సాహిత్యాన్ని గురించి, ఆ సాహిత్యాధ్యయన ప్రాధాన్యాన్ని గురించి వివరించాడు. మాక్సుమూలర్ సంస్కృత భాషాప్రీతి ఎంత గొప్పదో చెప్పేందుకు మరో ఉదాహరణ. ఋగ్వేద సంపుటాల ప్రచురణకు ఆయన భారతదేశంనుండి సేకరించిన ఎనభై తాళ పత్రగ్రంథ ప్రతులను అక్స్ఫర్డుకు తెప్పించుకొని పరిశీలించాడన్న సత్యం ఆయన నిశితపరిశోధనకు, విశిష్టవైదుష్యానికి, సంస్కృతభాషానురాగానికి ప్రతీక.

మొత్తంగా మాక్స్‌మూలర్ విద్యారంగంలో చేసిన కృషిని రెండు దశలుగా విభజించవచ్చు అందులో మొదటి దశలో భాషాశాస్త్రవిషయ పరిశోధనా ప్రాతిపదికంగా ఆయన కృషి నడుస్తుంది. ఈ దశ ఋగ్వేద సంపుటాల ప్రచురణ 1873 సం॥లో ముగించేవరకు సాగుతుంది. అప్పటినుండి రెండోదశ ఆరంభమౌతుంది ఈ దశలో విభిన్న దేశాలకుచెందిన మతాలమధ్యగల సామ్యసూత్రాలను పరిశీలించి సమన్వయించే కృషి చేశాడు. ఈ దశ ఆయన జీవితాంతంవరకు కొనసాగుతుంది.

మాక్స్‌మూలర్‌కు నియమం తప్పకుండా ప్రతిరోజూ పాఠం చెప్పే పద్ధతి అంటే అంత ఇష్టం లేకపోయినప్పటికీ సంస్కృత విద్యార్థుల వికాసానికి ప్రత్యేకంగా తన అమూల్య కాలంలో ఎన్ని గంటలో వెచ్చించేవాడు. ముఖ్యంగా అక్స్ఫర్డుకు సంస్కృతం నేర్చుకోవాలని వచ్చిన ముగ్గురు జపాను విద్యార్థులవికాసానికి ఆయన ఎంతగా పాటుపడిందీ చూస్తే ఆశ్చర్యం కలుగుతుంది. ఆ ముగ్గురు విద్యార్థులను సంస్కృతాన్ని చక్కగా అభ్యాసం చేసి, ఆ భాషలో వారిని పరిశోధనకు కూడా పూనుకొనేటట్లు చేశాడు మాక్స్‌మూలర్; ఆ జపాను శిష్యులు ప్రాచీన భారతదేశ సంస్కృతిని గురించి బాగా పరిశోధనలు జరిపి ఆయన పర్యవేక్షణలో చక్కని కృషి చేశారు. అందులో మొదటివాడు నాన్జియో (Bunyiu Nanjio) ఇతడు 1881 సం॥లో మాక్స్‌మూలర్ ప్రోత్సాహపరచగా

క్రీ.శ. 1వ శతాబ్దం తర్వాత చీనాభాషలోనికి అనువదింపబడిన వందలాది బౌద్ధమత సంస్కృత గ్రంథముల పట్టికను తయారు చేశాడు. ఇంకొకడు కస వార (Kenjiu Kasawara). ఇతడు బౌద్ధ పారిభాషిక పదాల పట్టికను సంకలన పరచాడు. ఇది మాక్స్‌మూలర్ సంపాదకత్వం క్రింద వెలువడ్డ "Anecdota Oxoneensia" పరంపరలో ప్రచురింపబడిందికూడా. మూడోవాడు టాకా కుసూ (Taka Kusu) ఇతడుకూడా మాక్స్‌మూలర్ ఉత్సాహపరచడంవల్ల స్ఫూర్తి పొంది, క్రీ.శ. 671_690ల మధ్య ఇండియాను సందర్శించిన ఇత్సింగ్ (I-Tsing)అనే చీనా యాత్రికుని యాత్రానుభవాలను చీనాభాషనుంచి ఆంగ్లంలోనికి 1896 సం॥లో అనువదించాడు. ఇలా తనకు చేరువకువచ్చిన జిజ్ఞాసువులను అమూల్యమైన పరిశోధనలను నిర్వహించేటట్లు ఆయన ప్రోత్సాహం రేకెత్తించేవాడు తన ప్రత్యర్థి బోడెన్ సంస్కృతాచార్య పీఠాన్ని గెల్చుకొన్నవాడూ అయిన మానియర్ విలియమ్స్ తర్వాత ఆ పీఠాన్ని అధిష్టించిన సంస్కృతాచార్యుడు మాక్స్ మూలర్ వల్ల ప్రభావితుడయ్యే తన మొదటి మూడు రచనలను ప్రకటించాడు, 19వ శతాబ్దాంతంలో భారతదేశం వెళ్ళిన ఐరోపా ఖండపు సంస్కృత పండితులు సముచితంగా గౌరవింపబడటం ఆయన చేసిన కృషికి ఫలితమే అని చెప్పాలి. అంతటి సామరస్య వాతావరణాన్ని ఆయన సృష్టించాడు.

ఆక్స్‌ఫర్డ్‌లోని క్లారెండన్ ప్రెస్ (Clarendon Press) ప్రతినిధిగా విశ్వవిద్యాలయానికి భారతదేశ విషయిక సాహిత్య సలహాదారుగా ఉండి 1877 నుండి 1898 సం॥ వరకు ఇరువది సంవత్సరాలపాటు ఎనలేని సేవ చేశాడు. తనకు తటస్థపడిన పండితులను ప్రపంచంలో అంతవరకూ బాగా ప్రచారంలోనికి రాని ముఖ్యమైన సంస్కృత తాళపత్ర లిఖిత ప్రతులను మారుమూలల్లోనైనా అన్వేషించి, సేకరించుమని ప్రోత్సహించేవాడు. ఆయన ప్రోత్సాహ ఫలితంగానే 1880 సం॥లో జపానులో క్రీ.శ. 6వ శతాబ్దానికి చెందిన సంస్కృత లిఖితప్రతిని ఒకదాన్ని కనుక్కోడం సంభవించింది.

మాక్స్‌మూలర్ చాలా రచనలు, చాలా ప్రసంగాలు చేశాడు రచనలలో, ప్రసంగాలలో ఆయనకుగల సాహితీప్రియత్వం కన్పిస్తుంది. వాక్య నిర్మాణంలో, భావప్రకటనలో ఎంతో నైపుణ్యం ఆయన ప్రదర్శిస్తాడు. ఈ సాహిత్యవైభవం తండ్రి విల్‌హెల్మ్‌మూలర్‌నుండి సంక్రమించిన ఆస్తి అనే చెప్పాలి. ఈయన జర్మనీ భాషలోకూడా కొన్ని రచనలు చేశాడు. తన మాతృభాషఅయిన జర్మనీ భాషలోకన్నా ఆంగ్లంలోనే ఎక్కువ రచనలు చేశాడు, ఆయన ఆంగ్లభాషా శైలి చాలామంది ఇంగ్లీషు రచయితల శైలికన్నా గొప్పదిగా కీర్తింపబడింది. అతిధారాళంగా, అతి సరళంగా భావాలను ఆవిష్కరించే ఆయనరచనారీతే ఎక్కువమంది పాఠకులను తనవైపుకు ఆకర్షించుకొని ఆకట్టుకోగలిగింది. ఉపన్యాసాలిచ్చేటప్పుడుకూడా గుండెకుతాకే ధోరణిలో ఆయన తన భావాలను మహాప్రవాహంగా వెలువరుస్తుంటే శ్రోతలు మంత్రముగ్ధులయ్యేవారు. ఈశక్తివల్లనే ఆయన ప్రాగ్దేశ మతగ్రంథాలపట్ల పశ్చిమ దేశాల ప్రజలలో అభిరుచిని కల్గించగలిగాడు. ఆయనరచించిన ఆంగ్లవ్యాసాలు ఎడింబరో (Edinburgh) సమకాలీనం (Contemporary) పంతొమ్మిదవ శతాబ్దం (Ninteenth Century) వంటి పత్రికలలో ప్రచురించబడుతూ ఉండేవి ఈ వ్యాసాలలో ఆయన గంభీరమైన ఆంగ్లభాషాశైలి మనకు గోచరమౌతుంది. ఈ వ్యాసాలన్నీ 'జర్మన్ కర్మాగారంనుండి మచ్చుతునకలు' (Chips from German Workshop) అనేపేరిట నాలుగు సంపుటాలుగా ప్రచురితములైనాయి కూడా. ఆయన పరలోకగతుడు కావడానికి ఒకటి రెండు సంవత్సరాలకు పూర్వం "Auld Lange Syne" అనే అనేక వ్యాసాలను గ్రంథ రూపంలో ప్రచురింపజేసాడు. ఈ వ్యాసాలలో ఆయన గత జీవిత స్మృతులను స్పృశించాడు. సాహిత్య పరిమళాలను వెదజల్లే రీతిగా ఆ స్మృతులను రచనాబద్ధం చేశాడాయన.

మాక్స్‌మూలర్ విశ్వవిఖ్యాతి పొందడానికి అనేక కారణాలు ఉన్నాయి. అతడు మామూలు పండితులెవరూ పొందలేని ఉన్నత పదాన్ని చరిత్రపుటలలో సాధించడానికి వైదుష్యంతోబాటు ఆయనకున్న విశాల భావుకత, పరిశ్రమ శీలత, విశ్రాంతి నెరుగని రచనల పరంపర అన్నీ కారణాలే. అదేకాక మంచిమంచి అవకాశాలన్నీ అదృష్టవశాత్తూ ఆయనను వెతుక్కొంటూ వచ్చాయి. ఋగ్వేదం ప్రచురించాలని సంకల్పం కలిగింది. ఎవరి సహాయం నిమిత్తమాత్రం అయితేనేమిగాక ఈష్టిండియా కంపెనీవారి నిధులు ఆ ప్రచురణకు సిద్ధపరుపబడ్డాయి. ఇలా ఎన్నెన్ని అవకాశాలో ఆయనను వరించినాయి. ఆయన ప్రతిభకు, వైదుష్యానికి వన్నెపెట్టాయి. ఆయన వేదాల అధ్యయనం చేబట్టిన తరుణంలో ఐరోపా ఖండంలో వేద పరిశోధనా వ్యాసంగం శైశవదశలో ఉంది. సాయణ భాష్యంతో ఋగ్వేద సంపుటాలను ప్రథమంగా ముద్రింపజేసి వెలుగులోకి తెచ్చే మహాభాగ్యం ఆయనకే లభించింది. ఇది ప్రపంచ సాహిత్య చరిత్రలోనూ ముఖ్యంగా సంస్కృత భాషారంగంలోనూ ఎవరూ మరచి పోలేని ఒక మహత్తర ఘట్టం. మరో విషయం. మాక్స్‌మూలర్‌కు అభిమాన విషయమైన తులనాత్మక భాషా శాస్త్రాన్ని గురించి ఆ రోజులలో ఇంగ్లండులో ఎవరికీ ఎక్కువ తెలియదు. ఇంగ్లండులో మొట్టమొదటగా ఈ విషయానికి ప్రచారం తెచ్చిన గౌరవం మాక్స్‌మూలర్‌కే దక్కింది. వారికి కొత్త అయిన ఈ శాస్త్రానికి ఒక ప్రతిపత్తి కల్పించి అక్కడి ప్రజాబాహుళ్యంలో కూడా దీనిపై ప్రీతిని కల్పించాడు. ఇంగ్లండులో తులనాత్మకంగా పౌరాణిక గాథలను పరిశోధించే విధానానికీ ఆయనే ప్రారంభోత్సవం జరిపించాడు. 19వ శతాబ్దపు ఉత్తర భాగంలో తులనాత్మక మతాధ్యయన పరిశోధనా వ్యాసంగాలకు మంచి వాతావరణం ఏర్పడింది. ఆ అనుకూల వాతావణంలోనే విశాల భావంతో మతాలను సమన్వయిస్తూ

భిన్న భిన్న మతాలు ఆ యా మతస్థులకు ఆరాధ్యాలనీ,వారి జీవిత లక్ష్యాలను తెలియజెప్పే పవిత్ర సందేశాలను అవి అందిస్తాయనే సామరస్య సంభరిత రచనలను ఆయన చేశాడు. ఆ పరిపక్వ సమయంలోనే ఆయన మతాలను వ్యాఖ్యానిస్తూ హిబ్బర్ట్ ప్రసంగాలు గావించాడు. ప్రాగ్దేశ మతాల పవిత్ర గ్రంధాల ప్రచురణ కూడా ఆ మంచి అదనులోనే ఆయన కృషిద్వారా వెలువడింది.

ఇలా ఎన్నెన్నో అవకాశాలు ఆయనను అన్వేషించుకొంటూ వచ్చాయి అవకాశాలు వరించినా అందరికీ వాటిని సద్వినియోగ పరచుకొనేందుకు తగినశక్తి సామర్థ్యాలుండవు. తటస్థపడ్డ అన్ని అవకాశాలను చక్కగా వినియోగపరచుకోగల మహా ప్రతిభాసంపన్నుడు మాక్స్ మూలర్. భాషలలో ప్రావీణ్యమే కాదు అచంచల దీక్ష, నిశిత పరిశీలన, సూక్ష్మపరిశోధన, ఏకాగ్రదృష్టి ఇవన్నీ ఆయన పట్టినదెల్లా బంగారం కావడానికి సహకరించాయి. ఆకాలంలో ఆయన ప్రతిపాదించిన అనేక సిద్ధాంతాలు అంగీకార యోగ్యాలు కావని తర్వాత కాలపు పరిశోధనలు నిరూపించినా ఆయారంగాలలో ఆయన చేసిన తీవ్ర కృషి తర్వాత వారిని అనేక విధాల ఉత్తేజ పరిచిందనే చెప్పాలి.

* * *

# వ్యావహారదక్షత

మహా విద్వాంసుడుగా, బహుగ్రంథ రచయితగా ఉక్కిరిబిక్కిరి అయ్యే కార్యక్రమ బాహుళ్యంలో మాక్స్‌మూలర్ మునిగి ఉన్నప్పటికీ ప్రపంచ వ్యవహారాలను ఆయన ఏనాడూ మరచిపోలేదు. ప్రపంచంలో సగౌరవంగా సమకాలికులచేత స్తుతింపబడుతూ కర్తవ్యపరాయణతకు వన్నె కూర్చుకొనడం చిన్ననాటి నుండి ఆయనకు వెన్నెతో పెట్టిన విద్య. బాల్యదశలోనే రాజాస్థాన వాతావరణంలో వ్యవహరించవలసినతీరు తాతగారింట్లో ఆయనకు అబ్బింది. యువకుడుగా ఉన్నప్పుడూ ఇంగ్లండులో అతితరుచుగా లండన్‌లోని ప్రష్యారాయబారి కార్యాయాలన్ని ఆయన సందర్శిస్తూ ఉండేవాడు. లండన్‌లోని ప్రష్యా రాయబారి బున్సెన్ ఆయనకు అంతరంగిక మిత్రుడు కావడమే అందుకు హేతువు. ప్రష్యారాయబారి బారన్ బున్సెనే విక్టోరియా మహారాణికి మాక్స్‌మూలర్‌ను పరిచయం చేశాడు. ఆ పరిచయాన్ని పెంపొందించుకొని, మాక్స్‌మూలర్ విక్టోరియా మహారాణికీ తదితర రాజకుటుంబసభ్యులకు సన్నిహితుడయ్యాడు.

ఐరోపా ఖండంలో అనేక దేశాల రాజులతో కూడా ఆయనకు వ్యక్తిగత పరిచయం ఉండేది. ఆనాటి జర్మనీ చక్రవర్తి ఫ్రెడరిచ్, స్వీడన్ రుమేనియా దేశాల ప్రభువులు, టర్కీ సుల్తాన్ వీరందరితో ఈయనకు సాన్నిహిత్యం ఉండేది. సమకాలికులైన దేశవిదేశ సుప్రసిద్ధులందరూ ఎలాగో అలాగు ఆయన పరిచయ పరిధిలోకి అడుగిడేవారు. అందులో కొంతమంది ఆక్స్‌ఫర్డులో ఆయన ఇంట్లో అతిథ్య మర్యాదలు కూడా పొందుతూ ఉండేవారు.

ఇంగ్లండు వచ్చిన భారతీయులందరికీ మాక్స్‌మూలర్ ఇంటికి వెళ్ళి ఆయనను దర్శనం చేసుకొనడం అంటే పుణ్యక్షేత్రం మెట్టినట్లు ఉండేది. ఆయన ఋగ్వేద సంపుటాలను సంశోధించి ప్రచురించడం వలనా, భారతీయమత ఆధ్యాత్మిక విషయాలను గురించి అనేక రచనలు గావించడంవలనా ఆయన కీర్తి చంద్రికలు భారత దేశమంతటా వెలివిరిశాయి. ఆ రోజుల్లోనూ అంతకు పూర్వమూ అనేక మంది ఐరోపా ఖండపు పండితులు భారత దేశాన్ని సందర్శించారు.

మాక్స్‌మూలర్ భారతదేశాన్ని ఎన్నడూ చూడకపోయినా, ఆయన తమ మతానికీ, తమ దేశ సౌభాగ్యానికీ ఎంతటి అవిరళ కృషి సాగించాడో భారతదేశ ప్రజలకు బాగా తెలుసు. ఆయనకు ఆనాటి అనేకమంది ప్రసిద్ధ భారతీయులతో ఉత్తర ప్రత్యుత్తర సంబంధాలు కూడా ఉండేవి.

మాక్స్‌మూలర్ తన జీవితాన్ని సమాజగమనంతో సమన్వయించుకొంటూ శ్రుతి కలుపుకొంటూ గడపాలని ఆశించేవాడు. అటువంటి శుభలక్షణాలవల్లనే ఆయనను అనేకసంస్థలకూ సమావేశాలకూ అధ్యక్షస్థానంలో కూర్చోబెట్టేవారు. అలా ఆయన ఇంగ్లండులో స్థాపించబడిన గెథె సొసైటీకి మొదటి అధ్యక్షుడయ్యాడు. ఆ అధ్యక్ష పీఠాన్నుండి 1886 సం॥ లో "కార్లయెల్-గెధె" అనే విషయాన్ని గురించి తన ప్రారంభోపన్యాసం చేశాడు. అదేకాక 1892 సం॥ లండన్ మహా నగరంలో ఏర్పాటుచేయబడ్డ అంతర్జాతీయ ప్రాచ్యభాషావేత్తల సమావేశాలకు (International Congress of Orientalists) అధ్యక్ష పీఠాన్ని

అలంకరించాడు. అంతకు పూర్వం కూడా 1874 సం॥ నుండి వరసగా యేటేటా సమావేశమౌతూ వస్తున్న ప్రాచ్య భాషావేత్తల సమావేశాలలో ప్రముఖ పాత్ర వహించేవాడు.

ఇలా ఉన్నత పదవులను ఆయన అధిష్ఠించడమేకాక కేవలం పాండిత్యానికని ఏ పండితుడూ పొందని గౌరవాలను ఆయన పొందాడు. ఇన్ని గౌరవాలు పొందినా మాక్స్‌మూలర్‌ను ఇసుమంత గర్వం కూడా ఆవేశించలేదు. ఇదంతా తన విద్యకేనని భావించుకొని, ఆయన వినయ సంపదను ఏనాడూ పోగొట్టుకోలేదు. ఆయన ప్రత్యేక దేశానికిసంబంధించిన "Pour le merite" కు చెందిన ఒక Kinght గా, the carona d' Italia యొక్క Knight గాను గౌరవింపబడ్డాడు. ఇంగ్లండులోని ప్రివీ కౌన్సిల్‌లోని సభ్యుడయ్యాడు. స్వీడన్ రాజువద్ద నుండి సగౌరవంగా "Northern star" (frst class) అందుకొన్నాడు. French legion of Honour తో అలంకరింపబడ్డాడు. The Bavarian Maximilian జర్మన్ దేశపు Albert the Bear, టర్కీదేశపు Madjidieh మొదలగు గౌరవాలతో ఆయన గౌరవించబడాడు. బెర్లిన్, బొలొగ్నా, బుడాపెష్ట్, కేంబ్రిడ్జ్, డబ్లిన్, ఎడింబరో, ప్రిన్స్టన్ వంటి అనేక దేశాల విశ్వవిద్యాలయాలు ఆయనకు డాక్టరేట్ గౌరవ పట్టాలను ఇచ్చి సత్కరించాయి. పారిస్‌లోని 'ఫ్రెంచి ఇన్‌స్టిట్యూట్', రోము బెర్లిన్‌లోను సార్డినియన్, బవేరియన్, హంగరీ, వియన్నాల అకాడామీలలోను మాక్స్‌మూలర్ విదేశ సభ్యుడు. ఇంకా ఉప్సలలోని (Upsala) రాయల్ సొసైటీలోను, అమెరికన్ ఫిలసాఫికల్ సొసైటీలోనూ, రాయల్ సొసైటీ ఆఫ్ గెటింగ్‌హెన్‌లో ఈయన ఉత్తరప్రత్యుత్తరాలు సాగించే సభ్యుడుగా ఉన్నాడు. గ్రేట్ బ్రిటన్, ఐర్లండులలోగల రాయల్ ఏషియాటిక్ సొసైటీలో ఆయన ఒక గౌరవ సభ్యుడు. 'జర్మన్ ఓరియంటల్ సొసైటీ'లో, ఇంకా ఆరీతిగా పరిశోధనా రంగానికి సంబంధించిన దాదాపు మరో ఇరవై సంస్థలలో ఆయన గౌరవ సభ్యుడు.

ఒక క్రమ పద్ధతిలో ఆయన దిన చర్య ఉండేది. కాబట్టే ఆయన నిర్ణీతమైన కాలంలో నిర్ణీతములైన పనులు నిర్వహిస్తూ ఎంతో సాహితీ

సృష్టి చేయడమేకాకుండా, దేశదేశాలనుండి వచ్చే లెక్కలేనన్ని లేఖలకు సమాధానాలు కూడా చాలావరకు ఇస్తూ ఉండేవాడు.

మాక్స్‌ముల్లర్‌లో మరో విశేషం ఉంది. ఆయనకు ప్రజాజీవితంతో, రాజకీయ సంఘటనలతో అతి సన్నిహితసంబంధం ఉండేది. క్రిమియన్ (Crimean) యుద్ధకాలంలో బ్రిటీష్ ఉన్నతాధికారులకు భాష విషయంలో శిక్షణ ఇవ్వాలనీ అదేకాక ప్రాచ్యబాషా సంస్థను (Oriental Institute) ఒక దానిని నెలకొల్పి దానిలో వారికి ప్రాచ్యభాషలలో సుశిక్షితుల చేయాలనీ, దానివల్ల బ్రిటీష్‌వారి వాణిజ్య వ్యాపారాలు కూడా వృద్ధి పొందుతాయనీ ఆయన వాదించాడు. ఫ్రాంకో–ప్రష్యా యుద్ధకాలంలో జర్మను వాదాన్ని బలబరుస్తూ "టైమ్సు" పత్రికలో అనేక లేఖలు ప్రచురింప జేశాడు.

మాక్స్‌ముల్లర్ భారత దేశానికి ఒక విద్వాంసుడుగా సేవ చేయడమే కాకుండా, భారత దేశపు రాజకీయాలతో ఎక్కువగా పొత్తు పెట్టుకొన్న గొప్ప రాజకీయవేత్తకూడా. మాక్స్‌ముల్లర్ మామూలు అర్థంలో రాజకీయవేత్త కాడు. ఋగ్వేద సంపుటాలు, ప్రాగ్దేశ పవిత్ర గ్రంధాలు ఎన్నిటినో ప్రచురింపజేసిన ఒక మహా పండితునికి అసలు రాజకీయాలతో పొత్తు ఏమిటి అని కొంతమందికి ఆశ్చర్యం కలగవచ్చు. రాజకీయ సంస్కారాలు ప్రతివారిలోనూ ఏదో రూపేణ సహజ సిద్ధంగా ఉంటూనే ఉంటాయి. రాజకీయ పరిజ్ఞానం అంటే నడుస్తూన్న రాజ్యాంగ చరిత్ర గతిని గురించిన పరిచితి. మాక్స్‌ముల్లర్ రాజకీయ పరిజ్ఞానంలో ఈ పరిచితి కంటె మించిన విశిష్టత ఉంది. ఇంగ్లండులో, జర్మనీలో, ఇండియాలో నడుస్తూన్న రాజకీయ చరిత్రను సమకాలీన సంఘటనలను అవగతం చేసికొంటూ కొన్నికొన్ని సందర్భాలలో ఆయన తన భావాలను నిర్భయంగా వెలువరించేవాడు. అప్పుడప్పుడూ వెలువరించిన ఆయన రాజకీయ భావనలకు ఆయా దేశాలలో అమిత ప్రాధాన్యం,ఎంతో ప్రచారం ఉండేది.

భారతదేశాన్ని ఏనాడూ సందర్శించకపోయినా మాక్స్‌మూలర్ ఆనాడు భారతదేశంలో వస్తూన్న మత, సాంఘిక రాజకీయాది సర్వ పరిణామాలను గురించి క్షుణ్ణంగా తెలుసుకొనేవాడు. ఆయన ఇంగ్లండుకు చేరుకొన్న నాటినుండి స్వర్గస్థుడయ్యే పర్యంతం భారత రాజకీయ చరిత్ర యొక్క అవగాహన ఆయనకు ఏ రాజకీయవేత్తకూ తీసిపోనంతగా ఉంది. అనేకమంది ప్రముఖులకు ఆయన వ్రాసిన లేఖలు, అనేక పత్రికలకు వ్రాసిన ఆయన వ్యాసాలు ఈ విషయాన్ని నిస్సంశయముగా ఋజువు చేస్తాయి. మాక్స్‌మూర్‌లకు భారత ప్రజలంటే అపారమైన సానుభూతి. ఆ సానుభూతితోనే ఆనాటి భారత ప్రజల ఆశలను, ఆశయాలను సావధానంగా అర్థముచేసికోగలిగాడాయన. 19 వ శతాబ్దంలో భారతదేశంలో ప్రవర్తిల్లిన మత ఆధ్యాత్మిక సంస్కృతి పునరుజ్జీవన యుగ ప్రారంభములో జరిగిన కృషి సంరంభంలో మాక్స్‌మూలర్‌కు ఒక విలక్షణమైన భాగస్వామ్యం ఉంది. భారతీయుల ఆధ్యాత్మికపు టౌన్నత్యాన్ని పాశ్చాత్యులకు తెలియజెప్పడమే కాకుండా "మీకు తరగని ఆధ్యాత్మిక భాండారమున్నది" అని భారతీయులకు ప్రబోధం అందించిన మహా మనీషి ఆయన. మాక్స్‌మూలర్‌కూ తెలుసు తన ఋగ్వేద సంపుటాల ప్రచురణ భారతీయ సాంస్కృతిక చరిత్రలో నూతన యుగ ప్రారంభానికి ప్రాతిపదిక వేసిన ఒకనాందీ వాక్యమని. అదేకాక అది ఐరోపా ఖండములోని ప్రాగ్దేశ విజ్ఞానాధ్యయన చరిత్రలో నూతనాధ్యాయాన్ని ప్రారంభించింది. "ఇది (ఋగ్వేదం) వారి బైబిల్। నాలుగైదువేల సంవత్సరాల వయోవృద్ధ అయిన ఈ గ్రంథం ఇదివరకు ఎన్నడూ ముద్రణలో వెలుగు చూడలేదు" అని మాక్స్‌మూలర్ ఒక సారి అన్నాడు. ఈమాటలో వేదకాల నిర్ణయం సంగతి, దానికి సంబంధించిన వాదోపవాదాలు. అలా వదలిచూస్తే ఒక రకమైన ఆర్ద్రత కన్పిస్తుంది. ఆ ఆర్ద్రభావనతోనే ఋగ్వేద సంశోధన భారాన్ని తన భుజస్కంధాలమీద వేసికొన్నాడు.

మాక్స్‌మూలర్ రోజులలో భారతదేశం బ్రిటీషువారి పరిపాలనలో ఉండేది. ఆనాటి బ్రిటీష్‌వారి భారతదేశపు పాలనలోని అనేక దోషాలను

మాక్స్‌మూలర్ విశితంగా విమర్శించాడు. బ్రిటీష్‌వారు పాలించే తీరులో మార్పులు సూచించాడు కాని, బ్రిటీష్‌పాలన పూర్తిగా భారతదేశాన్నుండి వైదొలగాలని ఆయన ఎన్నడూ భావించలేదు. బ్రిటీష్‌వారి పాలననుండి స్వాతంత్ర్యం పొందాలనే పిపాస భారతదేశంలోనూ పెరిగి, స్వాతంత్ర్యం ఒక ధ్యేయంగా ఒక ఉద్యమంగా రూపొందని రోజులవి. బ్రిటీష్ పాలన భారతదేశంలో తుడిచిపెట్టుకొని పోవాలనే భావన కాక, వారి పాలనలో దేశీయులకు మేలుకూర్చే సంస్కరణలు రావాలని వాదించే నాయకుల సంఖ్య భాతరదేశంలో ఆరోజులలో ఎక్కువగా ఉండేది. అటువంటి వారిలో ఎం. జి. రెనడె, కె. టి. తెలాంగ్, ఆర్. జి భండార్కర్, ఆర్. ఎల్. మిత్రా వంటివారు కొందరు ముఖ్యులు. మాక్స్‌మూలర్ బ్రిటీష్ ప్రభుత్వంపట్ల తనకుగల విధేయతనూ, భారతదేశం యెడల తనకుగల అభిమానాన్నీ రెంటినీ మేళవించి ప్రదర్శించటానికో అన్నట్లు "భగవానుడు మహారాణిని సంరక్షించుగాక!" (God save the Queen) అనే అప్పటి జాతీయ గీతాన్ని సంస్కృత భాషలోనికి అనువదించాడు. ఈ సంస్కృతీకరణ అప్పటి బ్రిటీష్ రాణికి ఎంతో సంతృప్తిని కూర్చింది. మాక్స్‌మూలర్ భారతదేశంపై ప్రేమాభిమానాలు కురిపిస్తూ చేసిన ప్రసంగాలు, రచనలు భారతదేశంలోని బ్రిటీష్ పాలకులలో ఎక్కువగా ఆందోళన రేకెత్తించాయి. భారతదేశంలో అప్పుడు గవర్నర్ జనరల్‌గా ఉన్న కర్జన్ మాక్స్‌మూలర్‌కు ఒకలేఖ వ్రాస్తూ ప్రాచీన భారతీయ విజ్ఞానాధ్యయనం యువకులైన భారతీయులలో విప్లవభావాలను రేకెత్తిస్తున్నదని వాపోయాడు, ప్రాచీన భారతీయ సంస్కృతీ వైభవ పరిశీలన యువ ప్రపంచంలో ఏదో చిచ్చురేపుతున్నది అని ప్రత్యేకించి మాక్స్‌మూలర్‌కు వ్రాయడం వల్ల కర్జన్ ఆయనను ప్రత్యక్షంగా దుయ్యపట్టకపోయినా పరోక్షంగా విమర్శించినట్లైంది.

మాక్స్‌మూలర్ భారత దేశంలోని బ్రిటీష్ పాలనకు కొంతవరకు మద్దతు నిచ్చినా, భారతదేశంలో బ్రిటీష్ ప్రభుత్వం కలకాలం కొనసాగదనే అపనమ్మకం మాత్రం ఆయన హృదయంలో మెదలుతూ ఉండేది. భారత ప్రజలను బ్రిటీష్‌వారు ప్రభుత్వపు ఇనుప చట్రాలలో బంధించి

పాలించాలనే భావం ఆయనకు ఎప్పుడూ నచ్చేదికాదు. భారతదేశం లోని బ్రిటీష్ ప్రభుత్వం మరింత సమర్ధవంతంగా, ప్రజాహితం కూర్చే దిగా ఉండాలని అభిలషించాడు. భారతదేశాన్ని రక్తపాతంతో గెల్చు కొన్నాం కాబట్టి దాన్ని రక్తపాతంతో చట్టాల ఇనుప చక్రాలమధ్య బిగించి పాలించాలనే శుష్కతర్కాన్ని మాక్స్‌మూలర్ తన సర్వశక్తులూ కూడ దీసికొని ఆక్షేపించేవాడు. అవకాశం వచ్చినప్పుడల్లా, అవసరం పడినప్పుడల్లా ఇంగ్లండు ప్రజలకూ, ఇంగ్లండు ప్రభుత్వంలోని చట్టనిర్మా తలకూ, రాజకీయ విధాన నిర్ణేతలకూ ఇండియాలోని బ్రిటీష్ పాలన అంతా సుఖప్రదంగా, శుభప్రదంగా లేదనే విషయాన్ని నిస్సంకోచంగా విశదపరచేవాడు. భారతదేశంలోని బ్రిటీష్ అధికారులలో భారతీయ సంస్కృతిని నిరాదరించడం, భారతప్రజలను ద్వేషించడం ఒక జాడ్యంగా పరిణమించిందని గుర్తించాడు. అది చాలా ప్రమాదకారియైన అవలక్షణం అని తలచి తీవ్రంగా గర్హించాడు. ఇండియాలో బ్రిటీష్‌వారి ప్రభుత్వం స్థిరంగా నిలదొక్కుకోవాలనుకొంటే పరిపాలకుల, పరిపాలి తుల మధ్య సత్సంబంధాలు నెలకొంటేగాని అది సాధ్యంకాదని హెచ్చ రిస్తూ ఉండేవాడు.

బ్రిటీష్‌పాలనలో ఉన్న ఆనాటి భారతదేశంలో సర్వత్రా ఆంగ్ల భాషాబోధనకే అమిత ప్రాముఖ్యం ఇవ్వాలనే ఒక వాదం ఉండేది. ఈ వాదానికి ప్రధాన ప్రతినిధి మెకాలే, ఇంగ్లీషు భాషే భారత దేశంలో పూర్తిగా వ్యాప్తి చెందాలనీ. భవిష్యత్కాలపు భాషగా కూడా ఇంగ్లీషే ప్రధాన భాషగా ఉండాలనే మెకాలే దృక్పథానికి పూర్తివ్యతిరేకి మాక్స్ మూలర్. ఒకసారి మెకాలేను లండన్ నగరంలో మాక్స్‌మూలర్ సందర్శించాడు. భారత దేశానికి వెళ్ళే ఐ. సి. ఎస్. ఆఫీసర్లు విధిగా ప్రాచ్య విజ్ఞానం అధ్యయనం చేయాలనే సూచన చేయడానికి ఆయన వద్దకు వెళ్ళాడు. కాని ముసలాయన మరీ ఘటికుడు. ఎందుకని వచ్చా వని ప్రశ్నించకుండానే వచ్చిన పనిగురించి చెప్పడానికి అవకాశం ఇవ్వ కుండానే సంభాషణ అంతా తనే సాగించి మాక్స్‌మూలర్‌ను సాగనంపాడు మెకాలే. ఆశాభంగం పొంది మాక్స్‌మూలర్ ఆక్స్‌ఫర్డుకు తిరిగి

వచ్చాడు. ఈ సందర్భంలో మెకాలే సహకార ప్రోత్సాహాలు ఆయనకు లభించకపోయినా ఆయన లక్ష్యాన్ని వీడలేదు. భారత దేశానికి చెందిన సర్వవిజ్ఞాన విషయాల అధ్యయనానికి పాటు పడేందుకు "ఇండియన్ ఇన్ స్టిట్యూట్" అనే పేరుతో ఒక సంస్థను సృష్టించాలనే విషయం చర్చకు వచ్చినప్పుడు మాక్స్‌మూలర్ పూర్తిగా మానియర్ విలియమ్స్‌కు మద్దతు ఇచ్చాడు. 1890 సం॥లో "school for modern oriental studies" అనే సంస్థను నెలకొల్పి తన లక్ష్యాలను సిద్ధింపచేసుకోవాలని యత్నించాడు. భారత దేశాన్ని ఏలడానికి ఇంగ్లండునుండి వెళ్ళే ఉన్నతాధికారులకు కొంత కాకపోతే కొంత అన్నా ఇండియాను గురించి సరిగ్గా తెలియాలని ఆయన ఆవేదన. అలా తెలుసుకొనడం ఒక మంచి వాతావరణం సృష్టిస్తుందని ఆయన భావన. భారతదేశ సంస్కృతిని గురించి, చరిత్రను గురించి అర్థం చేసుకొని వెళ్ళిన బ్రిటీష్ అధికారుల వైఖరిలోనే మార్పు వస్తుంది. వారు ఆ అవగాహనవల్ల భారత ప్రజలను వింత మనుష్యులుగా, భారత దేశాన్ని ఒక ప్రవాసంగా భావింపజాలరని మాక్స్ మూలర్ దృష్టి. ఆయన ఒక సందర్భంలో ఇలా అంటాడు—"భారతీయులు వింతమనుష్యులు కారు; వారు మన సోదరులు. మనం ఏమూల పదార్థంతో తయారైనవారమో వారూ అలా తయారైన మనుష్యులే".

పరస్పరావగాహన ఉన్నప్పుడు తోటివారి యెడల అసభ్యంగా ప్రవర్తించడం, నీచాలకు ఒడిగట్టటం జరగదు. భారతీయ సభ్యత తెలియకుండా భారతదేశం వెళ్ళే పరిపాలకుడు నిజంగా ఆ అజ్ఞానదశలో తాను పరిపాలించవలసిన ప్రజలను ఈసడించుకొంటూ అసభ్యంగానే ప్రవర్తిస్తాడు. భారతీయులను అజన్మ విరోధులుగా, కుట్రదారులుగా భావించి దమననీతితోనే నిరంతరం అణిచిపెట్టాలనే దృష్టి మార్చుకొని, వారిని విశ్వసించి, ప్రేమతో, ఆప్యాయతతో ధర్మంగా పరిపాలించాలని ఇంగ్లీషు వారికి మాక్స్‌మూలర్ గుర్తుచేస్తూ ఉండేవాడు. ఆనాటి భారతదేశంలో ఉన్నత పరిపాలనా బాధ్యతలను నిర్వహించిన సంస్కరణాప్రియులైన రిప్పన్, గ్లాడ్‌స్టన్ వంటివారిని ఆయన ప్రశంసిస్తూ ఉండేవాడు. ఆయనను ప్రీవీకౌన్సిల్ సభ్యుడుగా ఉండమని బ్రిటీష్ ప్రభుత్వం కోరింది.

ఈ ఆహ్వానంవల్ల ఆయన పాండిత్య విశేషాలకేకాక ఆయన రాజకీయ విషయాభిమానానికి కూడా గౌరవం చేకూర్చినట్లు అయింది.

భారతదేశంలో మతవిషయికంగా, సాంస్కృతికంగా, సామాజికంగా వస్తూన్న అన్ని మార్పులలో భారతదేశ చరిత్రలో ఏదో ఒక నూతన దశ ప్రాదుర్భవిస్తున్నదని మాక్స్‌మూలర్ గట్టి నమ్మకం. ఒక పక్క హిందూమత సంస్కరణోద్యమాలుగా రూపొందిన బ్రహ్మసమాజ ఆర్యసమాజాలు. సర్వసమన్వయప్రవక్త శ్రీరామకృష్ణ పరమహంస మహోపదేశాలు మరోపక్క అనాటి భారతదేశంలోని నూతన పునరుజ్జీవన పరిణామాలకు చిహ్నాలని గుర్తించాడు. ఇవన్నీ భారతీయుల జీవిత విధానాన్ని ఆధునికీకరణం చేయడానికి, వారిలో జాతీయ భావాలు ఉదయింప జేయడానికి సహకరిస్తున్నాయని ఆయన వ్యాఖ్యానించాడు. మాక్స్‌మూలర్ గ్లాడ్‌స్టన్‌కు ఒక లేఖ వ్రాస్తూ బ్రహ్మసమాజనాయకులైన కేశవ చంద్రసేన్ పి. సి. మంజుదారుల కృషిని గురించి ఇలా భాష్యం చెప్పాడు–"వీరు మంచి మార్గంలో మహత్తరమైన లక్ష్యం వైపునకే పయనిస్తున్నారు. వారు అలా కార్యక్షేత్రం దున్నడంలో, విత్తులు నాటడంలో, నీరు పెట్టడంలో–ఆ కృషిఫలాన్ని మనం చూస్తాం అనే ఆశలేకపోయినా అన్ని విధాలా వారికి సహకరించడం సంతోషదాయకమైన విషయం." ఇలా ఆప్తమిత్రుడగు గ్లాడ్‌స్టన్‌కు సందర్భం వచ్చినప్పుడల్లా భారతదేశానికి సంబంధించిన తన అభిప్రాయాలను వెల్లడిస్తూ లేఖలు వ్రాస్తూ ఉండేవాడు మాక్స్‌మూలర్. ఆయన భారతదేశంలోని పరిణామాలను నిశితంగా పరిశీలించడమే కాకుండా, భారతీయులు ఆమార్పులను గురించి ఎలా వాఖ్యానించుకొనేవారో కూడా అర్థం చేసుకొనడానికి యత్నించేవాడు. ఆయన భారతీయ నాయకులతో, సంస్కర్తలతో ధారాళంగా ఉత్తర ప్రత్యుత్తరాలు సాగించడంవల్ల ఈ విషయాలన్నిటిని సులభంగా గ్రహించుకొనేవాడు.

పెద్దపెద్ద వారితో తనకున్న పరిచయాలను ఆధారం చేసుకొని తన పలుకుబడిని వినియోగించి మాక్స్‌మూలర్ తన భారతీయ మిత్రులకు

అనేక సందర్భాలలో అనేక విధాలుగా సహకరించాడు. ఒక సందర్భంలో చిన్న వయస్సులోనే వైధవ్యం పొందిన భారతీయ బాలవితంతువుల కడగండ్లను, ముఖ్యంగా రుక్మాబాయి ఉదంతాన్ని విశదపరుస్తూ వారిని ఆ కష్టాలనుండి గట్టెక్కించే తరుణోపాయం చూడమని ఆయన విక్టోరియా మహారాణికి ఒక విజ్ఞప్తి పంపిచాడు. స్త్రీజననిధికి మరింత నిధులు సేకరించి, ఈ పని నిర్వహించే ఏర్పాటు చేయమని రాణీగారికి ఆయన సూచించాడు. భారతీయులకు తమ అభిప్రాయాలను వ్యక్తంచేయడానికి బ్రిటిష్ పార్లమెంటులో ప్రాతినిధ్యం, ఓటు హక్కు ఉండడం ఒక మార్గం. ఆ రోజులలో లాల్ మోహన్ ఘోష్ అనే ఆయన బ్రిటిష్ పార్లమెంటులో ప్రవేశించడానికి ప్రయత్నించాడు. ఆ ప్రయత్నాలకు సహరిస్తూ మాక్స్‌మూలర్, జాన్ బ్రైట్ వంటివారు ఆయన ఎన్నికయేందుకు అనేక విధాలుగా ప్రయత్నాలు చేశారు. వారి ప్రయత్నాలు ఫలించలేదు. మాక్స్‌మూలర్ భారత జాతీయోద్యమ నాయకులకు చేసిన ఆఖరు సేవ ఆయన బాల గంగాధర తిలక్ పక్షాన వాదించడం ఒక హత్య కేసులో ఇరుక్కొనడం మూలాన బాలగంగాధర తిలక్‌కు బ్రిటిష్ ప్రభుత్వం 18 నెలల కఠిన శిక్ష విధించింది. ఆ సందర్భంలో తిలక్ నిరపరాధిఅనీ న్యాయంచేకూర్చవలసిదనీ ఆర్. సి. దత్తు, దాదాబాయి నౌరోజీ W. W. హంటర్ మొదలైన నాయకులు సంతకాలు పెట్టిన విజ్ఞప్తి పత్రంలో తానూ సంతకంపెట్టి విక్టోరియా మహారాణికి ఆ మహజరును అందజేసే అవకాశం కల్పించాడు.

మాక్స్‌మూలర్ భారతదేశంలోని రాజకీయోద్యమాలను కూడా శ్రద్ధాసక్తులతో పరిశీలించేవాడు. భారతదేశపు రాజకీయోద్యమాలను గురించి ఆయన వ్రాసినప్పుడల్లా పాలించే బ్రిటీషు వారి యెడలకాక పాలితులగు భారత ప్రజల పట్లనే అత్యంత సానుభూతిని ప్రదర్శించేవాడు. బ్రిటిష్ ప్రభుత్వం ఇండియన్ కౌన్సిల్ బిల్లును ప్రవేశపెట్టి చట్టం చేసినప్పుడు—"ఇది ఋజుమార్గగమనంలో ఒక అడుగు ముందుకు వేసినట్లు" అని భావించాడు. ఆ బిల్లు సందర్భంలో 1892 సం॥ లో జి ఎన్. గుప్తకు ఒక లేఖ వ్రాస్తూ————— "భారత జాతీయ

కాంగ్రెసు ఈ ముఖ్య విషయాన్ని సాధించినందుకు తృప్తిని వెల్లడించాలి — — — — - - - - ప్రభుత్వ యంత్రాంగానికి విడిగా ప్రజా ప్రతినిధులుగా ఎన్నుకోబడ్డ వారితో కూడిన బాధ్యతాయుతమైన స్వయం పాలిత సంస్థలను భారతదేశంలో ప్రారంభించాలని నేను ఆశిస్తున్నాను. కలకత్తా మహానగరంలో పార్లమెంటును నెలకొల్పడం నా జీవితకాలంలో నేను చూడలేకపోవచ్చు. ఒక విషయం నాకిప్పుడు విస్పష్టంగా అన్పిం స్తున్నది. ఆ పార్లమెంటు వెస్ట్ మినిష్టర్‌లోవలె విధేయంగాను, డబ్లిన్ కన్నా మరింత విధేయంగాను ఉంటుందని నాకు తెలుసు." మాక్స్ మూలర్ ఆశించిన ఆ పార్లమెంటు భారతదేశంలో బ్రిటీష్‌పాలన ఉన్నంత కాలం నెలకొల్పబడనేలేదు. ఆయన ఆశించిన రీతిగా అది బ్రిటీష్ ప్రభువులకు విధేయంగా ఉండే పరిస్థితి ఏర్పడనూలేదు. ఆయన భారత జాతీయవాదులను చాలవరకు ప్రోత్సాహ పరిచినా, బ్రిటీష్ విధేయత అనే హద్దును దాటి ఆయన ఆలోచనలు ముందుకు సాగలేదు. కొందరు ఆనాటి భారతీయ నాయకులు ఎంతవరకు వెళ్ళి ఆగారో ఆయన అక్క-డికే వెళ్ళి ఆగాడు. అంతకన్నా ముందుకు పోవడానికి పరిస్థితులు పరి పక్వం కాలేదు. వాతవరణమూ సుముఖంగా లేదు. ఆనాటి భారతనాయకులు కొందరు హోంరూలు ఉద్యమం స్థాయి దాటి వెళ్ళలేక పోయారు. మరి కొందరు సంఘ సంస్కర్తలు, రాజకీయ నాయకులు హోంరూలు ఉద్యమాన్ని కూడా అంగీకరించే దశలోనే లేరు. అదీ అప్పటి భారతదేశపు పరిస్థితి.

19వ శతాబ్దంతో ప్రవర్తిల్లిన భారత జాతీయ సాంస్కృతిక పునరు జ్జీవ కార్యక్రమానికి ప్రత్యక్షంగా పరోక్షంగా మాక్స్‌మూలర్ చాలా ఉత్సాహం పూరించాడు. ఆనాటి కార్యక్రమాలు, ఉద్యమాలు మేల్కొంటున్న భారత జాతి లక్షణాలని ఆయన భావించాడు. ఆ ఉద్యమాలలో భారత దేశపు గతవైభవానికి సంప్రదాయాలకు ప్రాముఖ్యం, జాతీయ లక్షణాలు అందులో ప్రాధాన్యం వహించడం ఆయన బాగా గుర్తించాడు. ఇలా భారతదేశంలో వస్తున్న పరిణామసంరంభంలో భారతీయులు తమను తాము గుర్తించుకొని తమ ప్రాచీన తత్త్వవిశేషాలను. సాహిత్య వైశి

ష్ట్యాలను పునర్దర్శనం చేసుకోనడం వాస్కోడిగామా చేసిన పనికన్నా కోటానుకోట్ల రెట్లు గొప్పదని ఆయన భావించాడు. తనకు తటస్థపడ్డ ప్రతి భారతీయునకూ గతాన్ని గుర్తుచేస్తూ, ఉజ్జ్వలభవిష్యత్తు వైపునకు సాగిపోయేందుకు తగిన ఉత్సాహాన్ని అందించేవాడు. గతవర్తమాన కాలాలలోని భారతదేశపుటౌన్నత్యాన్ని ఉగ్గడిస్తూ, భారతదేశం యెడల భారత ప్రజల యెడల గౌరవభావం పెంపొందించుకొనుడని తన ఆంగ్ల సమకాలికులకు ప్రబోధించేవాడు.

*　　　*　　　*　　　*

# సామరస్య శిఖరం

రెండు గొప్ప లక్షణాలు మాక్స్‌మూలర్‌కు ఔన్నత్యాన్ని ప్రసాదించాయి. మొదటిది విజ్ఞానాన్ని సరళమైన భాషలో రంజకంగా ఆవిష్కరించి అందించాలనే ఆయన సహృదయత. రెండోది అయన చేసిన కృషి అంతటి వెనుకా నిలబడి శాసించిన ఆయన తత్త్వజిజ్ఞాస. ఎ.వి.విలియమ్స్ జాక్సన్ అనే అమెరికన్ 1900 సం॥లో ఒక పత్రికలో వ్రాస్తూ మహా విద్వాంసుడుగా ఉన్నతోన్నత లక్ష్యాలను సాధించిన మాక్స్‌మూలర్ వ్యక్తిత్వంలో అపార పాండిత్యమూ, ఆ పాండిత్య విశేషాలను మృదు మధుర వాక్యాలతో సామాన్య ప్రజానీకానికి కూడా అందించే నేర్పూ సమ్మేళనం పొంది ఉన్నాయన్నాడు.

మొదటినుండీ ఆయనలో తాత్త్వికజిజ్ఞాస ప్రజ్వలంగా ఉండేది. ఈ తత్త్వదృక్పథమే ఆయనలో మూఢత్వాన్ని లేకుండా తొలగించి వేసింది. మొదట్లో ఆయన క్రైస్తవాన్ని బాగా విశ్వసించి ప్రత్యేకంగా అభిమానించినా తర్వాత తర్వాత ఇతర మతాల అధ్యయనంవల్ల ఆయ

నలో మతపు హద్దులకు మించిన మానవతా సామరస్యం వెల్లి విరిసింది. "వేదాలంటే వారి బైబిల్" అనేటంతటి సహన స్వభావం ఆయన వ్యక్తిత్వానికి అలంకారమైంది. క్రైస్తవేతరులను "పేగన్స్" అని విమర్శించడం అలాగే హిందువులు కానివారిని 'మ్లేచ్ఛ'లని తక్కువ చూపు చూడటం, ముస్లిములు ఇస్లాము మతేతరులను "కాఫిర్లు" అని దుయ్యబట్టడం వంటి అవలక్షణాలు సత్యసాక్షాత్కారానికి నిజంగా ఆటంకాలే. ఇటువంటి సంకుచిత భావాలు వికసించని ఇరుకు మనస్సులను సూచిస్తాయి. మనోవికాస ప్రగతిపథంలో ముందుకు అధిరోహించినప్పుడు ఈభావనలు అదృశ్యమై పోకతప్పదు. మాక్స్‌మూలర్ దృష్టిలోని నిర్దోషత, మానసిక వికాసం సర్వ సంకుచితదశలన్నిటికీ మించిన సామరస్యస్థాయిని ఆయనకు ప్రసాదించింది.

18వ శతాబ్దంలో చాలా కొత్తకొత్త శాస్త్ర పరిశోధనలు జరిగాయి. నూతన విషయాలు కనుగొనబడ్డాయి. అప్పటికే డార్విన్ పరిణామ వాదాన్ని ప్రతిపాదించి క్రైస్తవ మత విశ్వాసాలమీద గట్టి దెబ్బ కొట్టాడు. మాక్స్‌మూలర్ ఆ ప్రయోగాత్మకశాస్త్రపరిశోధనల విలువను గుర్తించిన ధీమంతుడు. అందుకని సైన్సుకు, మతానికిమధ్యగల అంతరాన్ని తొలగించి, సమన్వయించి వాటికి సన్నిహితత్వం కూర్చాలని ఆకాంక్షించాడు. భారత దేశపు మతగ్రంథాలను భాషా దృష్టితో ముందు పరిశీలించి, తర్వాత వాటిలోని భావాన్ని అ భావములకు దేశదేశాల మత తాత్త్విక భావనలతోగల పోలికలను గురించి ఆయన అన్వేషించాడు. రెండు మూడు దశాబ్దాలదాటు క్రైస్తవ మతస్థాయిలో మిగిలిన మతాలను ఉంచి వాటితో పోల్చి విమర్శించడం ఆయనకు ఆ దశలో వీలుపడలేదు తర్వాత పరిపూర్ణంగా మానసికంగా వికసించిన దశలో ఆయన క్రైస్తవేతర మతాలన్నిటిని సహనదృష్టితో పరికించే ఉదారభావం ఆయనలో పెంపొందింది. ఆ వికసిత స్థాయిలోనే మూఢత్వాన్ని అధిగమించి సత్యమని తోచిన విషయాలను బాహాటంగా ధీమాగా చెప్పగలిగే స్థితికి వచ్చాడు. ఆ కాలంలో ప్రయోగాత్మక శాస్త్ర పరిశోధనా ఫలితాలు కూడా ఆయనకు ఈ దృష్టిని అలవర్చినాయనికూడా చెప్పుకోవచ్చు. అన్ని

టికి మించి 1859 సం॥లో జీవోత్పత్తి వికాసాలను వివరించిన డార్విన్ మహాశయుని ప్రభావం ఆయనపై బాగా ప్రసరించింది. ముఖ్యంగా డార్విను పరిణామవాద ప్రభావం మాక్స్‌మూలర్ భాషాశాస్త్ర పరిశోధనలపై బాగా పడింది. పరిణామ వాదానికి ప్రతివాదిగా భాషాశాస్త్రం ఎలా నిలిచి డార్విన్ పరిణామవాదంలోని భౌతిక ప్రాధాన్యాన్ని ఎలా ఎదుర్కోగలదో షార్ప్‌స్‌బర్గ్ విశ్వవిద్యాలయ ప్రసంగాలలో వివరించాడు. 1872 సం॥లో షార్ప్‌స్‌బర్గ్ విశ్వవిద్యాలయంలో భాషా శాస్త్రాన్ని గురించి ఉపన్యసిస్తూ మాక్స్‌మూలర్ ఇలా అన్నాడు_ "భాషాశాస్త్రం ఒక్కటే పరిణామ సిద్ధాంతాల వెల్లువకు అడ్డుకట్ట వేయగలిగేదని నాలో నేను సమాధాన పడ్డాను. అదొక్కటే ద్రవ్యాన్ని ఆత్మనుండీ మనిషిని పశువునుండీ విడదీసి వాటిమధ్య సత్యసమ్మతమైన విభజనరేఖను సృష్టించకలేది." ఇలా భౌతిక వాదాన్ని వ్యతిరేకించినా ఆనాటి శాస్త్రీయ దృక్పథంలోని హేతువాదరీతులను ఆయన స్వీకరించాడు. డార్విన్ పరిణామవాదంలోని అతి ముఖ్యమైన సాదృశ్య విధానాన్ని భాషా పరిశోధనలలో మాక్స్‌మూలర్ ప్రవేశపెట్టాడు. ఆ సాదృశ్య పరిశీలనా పద్ధతిని అవలంబించి విభిన్న భాషలమధ్యగల పోలికలను వెతకడం ప్రారంభించాడు. మాక్స్‌మూలర్ అవలంబించిన ఈ తులనాత్మక విధానం భాషారంగంలో నేటికీ అవలంబింప బడుతూనే ఉంది. ఇలా తులనాత్మకంగా మతాలను గురించీ వివేచన చేశాడు. ఇటువంటి సామ్యాల పరిశీలనవల్ల Parity of all religions అంగీకరించడం సంభవిస్తుందని ఆయన విశ్వసించాడు. ఈ విషయాన్ని 1873 సం॥లో 'మతమీమాంసాపరిచయం' అనే తన గ్రంథంలో విస్పష్టంగా ఇలా వివరించాడు_ "మనలో ప్రతివారికీ తమ మాతృభాషను గురించి, మాతృమతాన్ని గురించీ తమకు సంబంధించినదనే ప్రత్యేక అభిమానం ఉంటుంది. కాని చారిత్రక దృక్పథంగల వ్యక్తులుగా అన్ని భాషలను, అన్ని మతాలను సమదృష్టితో దర్శింపగల క్రాంతి దర్శనం మనకు అలవడాలి." పరిణామవాదం జీవోత్పత్తి వికాసాలను గురించి కొన్ని సిద్ధాంతాలను ప్రతిపాదిస్తుంది. ఉత్పత్తి వికాసాల దృష్టితో మతాలనుకూడాచూచి విమర్శించాలని మాక్స్‌మూలర్ భావించాడు.

1878 సం॥లో ఏప్రిల్, మే, జూన్ మాసాలలో వెస్టమినిస్టర్‌లో ఇచ్చిన "హిబ్బర్ట్" ప్రసంగాలలో మతోత్పత్తి వికాసాలను గురించి విపులంగా చర్చించాడు. మతోత్పత్తి వికాస సిద్ధాంత ప్రతిపాదనకు ఇండియా మత చరిత్ర చాలా ఉపయోగపడుతుందని భావించాడు. ప్రాగ్దేశ పవిత్ర గ్రంథాల అధ్యయనం తనకు ఈ స్ఫురణను కల్గించిందని ఆయన అంటాడు. ఆర్యులు వ్యక్తాన్నుండి అవ్యక్తానికీ, పరిమితత్వాన్నుండి అపరిమితత్వానికీ సాధించినఅతిప్రాచీన మార్గం భారతీయ సనాతన మతపథమని మాక్స్‌మూలర్ భావన. అదేకాక సనాతన భారతీయార్యుడు మత ప్రగతిపథంలో ముమ్ముందుకు నడచి, పైపైకి వికసించి సాగిపోయాడనీ, అలా ఉన్నతోన్నత పరిస్థితులను అతడు అధిరోహిస్తున్నకొద్దీ ఈ జగత్తును సూక్ష్మంగా మార్చుకొన్నాడనీ స్వర్గం సన్నిహితం చేసుకొన్నాడని ఆయన వివరిస్తాడు.

కేవలం మతచరిత్రలనే కాకుండా మొత్తం మానవజాతి చరిత్ర పరిశీలనలోనే మాక్స్‌మూలర్ తన చారిత్రక దృష్టిని అపరూపంగా ప్రదర్శించాడు. ప్రకృతి పరిశీలన, చారిత్రక పరిణామ వివేచన, మనుష్య వికాస అధ్యయనానికి సహకరిస్తాయని ఆయన నమ్మకం. డార్విన్ జీవ పరిణామ రంగంలో ప్రతిపాదించిన 'మనుగడకై పోరాటం' (Struggle for existence), 'బలంతో బ్రతకగలగడం' (Survival of the fittest) అనే ముఖ్య సిద్ధాంతాలను మాక్స్‌మూలర్ భాషావిషయ పరిశోధనతో అనుసంధించాడు. భాషలోని పదాల చరిత్రలో ఒక్కొక్కప్పుడు ఆయా పదాలమధ్య సంఘర్షణ వస్తుంది. ఆ సంఘర్షణలో బలిష్ఠమై నిలవగలిగిన పదాలుమాత్రమే ఆఖరకు మిగులుతాయి. మొదట్లో మాక్స్‌మూలర్ పూర్తిభావవాదిగా బయలుదేరినా, తర్వాత తర్వాత డార్విన్, హెకెల్, స్పెన్సర్‌ల భౌతికవాదధోరణులు ఆయన ఆలోచనారీతిని మార్చివేశాయి.

భాషాతత్త్వ పరిశోధనను ఆయన జీవితమంతాసాగిస్తూనేఉన్నాడు. ఆయన దృష్టిలో పదాలకు జీవిత చరిత్రలు ఉంటాయి. ప్రతి పదానికి దాని ఉత్పత్తి మొదలుకొని ఎంతో చరిత్ర ఉంటుంది. కొన్ని పదాలు యుగయుగాల చరిత్రలను మనకు చెబుతాయి. భాషలోని పదాలను, వాటి నేపథ్యంలోగల చరిత్రలను అవగాహన చేసుకొంటూ పోతే మానవజాతి చరిత్రను గురించి ఎంతో తెలుసుకోగలమని ఆయన భావన. మానవ నాగరికతా సంస్కృతులు భాషపై ఆధారపడి ఉన్నాయి. మనిషి భాషను సృష్టించుకొని భాష సాయంతో సంభాషణ సాగించగల విశిష్టజంతువు. ఆ విశిష్టతవల్ల తన అంతరంగాన్ని బహిర్గతం చేయగలిగేశక్తి అతనిలో ఉంది. పదజాలమే మనుష్యులమధ్య జాతులమధ్య విభేదాలను కల్పిస్తూ ఉంటుంది. ఆ విభేదాలే చిన్న చిన్న తగాదాలకు, పెద్ద పెద్ద యుద్ధాలకు కారణ భూతమౌతున్నాయి. తత్ఫలింగా మానవాళికి మహా విపత్తులు సంభవిస్తున్నాయి. పదాలకున్న ఈ మహత్తరశక్తిని గురించి మాక్స్‌మూలర్‌కు విస్పష్టంగా తెలుసు. అందుకనే ఆయన భాషల అధ్యయనానికి అంత ప్రాధాన్యమిచ్చాడు. భాషాశాస్త్రాన్ని భౌతిక రసాయనిక శాస్త్రాలకు దీటువచ్చే ప్రత్యేకశాస్త్రంగా ఆయన భావించాడు. ముఖ్యంగా ఒక భాషను మరో భాషతో పోల్చి తులనాత్మకంగా విమర్శించే పద్ధతిని ఆయన స్వీకరించాడు. ఈ పద్ధతి మాక్స్‌మూలర్‌తోనే ప్రారంభంకాలేదు. అంతకు పూర్వం జర్మనీలో ఈ విషయంలో కొందరు కృషి చేసి ఉన్నారు. మాక్స్‌మూలర్ ఈ విషయంలో ప్రత్యేకంగా చేసిందిది. ఆయన భాషా పరిశోధనా వ్యాసంగానికి తాత్త్వికప్రయోజనాన్ని కల్పించి, శాస్త్రీయ పద్ధతులను ఏర్పరిచి ఈ రంగానికి ఒకసుస్థిర భూమికను తయారు చేశాడు. అదేకాక ఆంగ్ల విద్యాధికులందరిలో ఈ విషయంపై అభిరుచి కల్గేటట్లు ఆరోజులలో ఆయన చేయగలిగాడు. పండితులేకాక పామరులకు కూడా ఆసక్తి కలిగించే రీతిగా దీనికి ఒక ప్రతిపత్తినీ, ప్రచారాన్నీ కల్పించాడు. మీదుమిక్కిలి ఆ రోజుల్లో విక్టోరియా మహారాణి కూడా ఈ భాషా విషయిక విశేషాలను తెలుసుకోవాలని కుతూహలపడింది. రాజభవనంలో తనకూ తన పిల్లలకూ ఈ కొత్త శాస్త్రాన్ని గురించి ఒక ఉపన్యాసం

ఇయ్యండని మాక్సుమూలర్‌ను ఆహ్వానించింది. ఆమె ఆహ్వానాన్ని పురస్కరించుకొని ఆయన రాజాంతఃపురంలో 1864 సం॥ జనవరి మాసారంభంలో ఒక ఉపన్యాసం ఇచ్చాడు.

మాక్సుమూలర్ క్రైస్తవ మత విశ్వాసియే. ఆయనలో క్రైస్తవ విశ్వాసం బాగా స్థిరపడి ఉన్న మొదటి రోజులలో క్రైస్తవ మిషనరీల ప్రచారాన్ని ఆయన వ్యతిరేకించలేదు. అయినా ఆ దశలో కూడా ఆయన క్రైస్తవమతదృష్టి సంకుచితమైందికాదు. మత మౌఢ్యంతో క్రైస్తవాన్ని గుడ్డిగా నమ్మడం కాకుండా విశాలభావప్రపూర్ణుడై ఆయన క్రైస్తవ సిద్ధాంతాలను పరిశీలించేవాడు. అందుకనే క్రైస్తవ సిద్ధాంతాలను అతి మూఢంగా ప్రచారం సాగించడమే క్రైస్తవ మతంలోనికి ఇతర మతస్థులను మార్చడమే మిషనరీల ప్రధాన లక్ష్యంగా, కార్యక్రమంగా ఉండరాదని భావించేవాడు. ఆర్గిల్ అనే ఆయనకు వ్రాసిన లేఖలో ఆయనిలా వ్రాశాడు—" 19వ శతాబ్దపు క్రైస్తవం ఇండియాలోఉండవలసిన క్రైస్తవం ఏనాటికీ కానేకాదు. కేవలం ఊరికే చెప్పుకొనిపోయే ప్రవచనాలు కాదు. దానిలో అంతర్యం ముఖ్యం. ఎంతమందిని క్రైస్తవ మతం లోనికి మార్చాలన్నది కాదు. ఎన్ని విశాల క్రైస్తవ సూక్తులను ప్రచారం చేశామన్నది ముఖ్యం. మతం మార్పిడీలేకుండానే ఇతరమతస్థులగువారిలో క్రీస్తుసందేశాలు ప్రచారమైతే అది క్రైస్తవానికి ఎమీ ప్రమాదం వాటిల్లినట్లు కాదు."

మాక్సుమూలర్ ప్రాగ్దేశ పవిత్రగ్రంథ పరంపరలను ఒకక్రైస్తవ మిత్రునకు ఇలా వ్రాశాడు—"ఈ భూమిమీద ప్రతిదీ ధర్మం వైపునకు సత్యవైపునకు పరిపూర్ణతవైపునకూ మొగ్గుతూఉంటుంది.అందుకనిభూమ్మీద క్రైస్తవంతో కూడా కలుపుకొని ఇతర మతాలలోని సత్యాలను ఇముడ్చుకోనిది పూర్తి ఏదీసత్యంకాదు, ధర్మంకాదు, సంపూర్ణతకాదు."క్రైస్తవమే

కాదు. ఈ ప్రపంచంలో ఇంకా అనేక మతాలు ఉత్పన్నమై వికసించా యన్న భావం నెలకొని, తులనాత్మక మతాధ్యయనానికి బాట నిర్మించింది. దానివల్లనే ఆయన సంకల్పం నుండి ప్రాగ్దేశ పవిత్ర గ్రంథాల ప్రచురణా ప్రణాళిక కూడారూపొందింది. ఆయన "Sacred Books of the East" పరంపరలోని మొదటి సంపుటపు ఉపోద్ఘాతంలో ఈవిషయాన్ని సుస్పష్టం చేశాడు కూడా. క్రైస్తవానికే అంటిపెట్టుకొని ఉండకుండా మిగిలివున్న మతాలను తన పరిష్వంగంలో ఇముడ్చుకొనే సహనశీలత, సామరస్య దృష్టి ఆయన జీవితపు ఆఖరు వత్సరాలలో మరింతంగా అభివృద్ధి చెం దింది. ఎక్కడ గొప్పతనం ఉన్నా స్వీకరించుకొని కళ్ళనద్దుకోగల ఔన్నత్య శిఖరాన్ని ఆయన అధిరోహించాడు. అందుకనే భారతదేశపు షడ్దర్శనాలను గురించి చర్చించి, అందులో వేదాంత దర్శనాన్ని గురించి ఆయన వ్రాసిన మాటలు ఇందుకు తార్కాణంగా నిలుస్తాయి, షడ్దర్శనా లను గురించి వ్రాసిన గ్రంథపుపీఠికలో— "మానవాళి భావుకత వేదాంత దర్శన నిర్మాణంతో పర్యవసించి పరాకాష్ట నందింది" అని వ్రాశాడు. ఆయనకు వేదాంత విషయంలో అంతటి అభిమానం అలా ఏర్పడింది. మాక్స్‌మూలర్ జీవిత సాయంతనంలో ఉండగా ఆయనను దర్శించిన వివేకానందస్వాములవారు ఆయనను వేదాంతసిద్ధాంతం యొక్క హృదయాన్ని ప్రత్యక్షం చేసుకొన్నాడనీ, ఆయన వేదాంతులకు వేదాంతి అనీ ఉగ్గడించాడు. శ్రీరామకృష్ణ పరమహంస ఉపదేశాలు మాక్స్‌మూలర్‌ను ఆకర్షించాయి. శ్రీరామకృష్ణుల సందేశాలవల్ల అలా ఆకర్షితుడు కావడం ఆయన భావవికాస పథంలో సామరస్య శిఖరాధిరోహ ణలో అన్నిటికన్నాపై మెట్టు అనిఅనవచ్చు. శ్రీరామకృష్ణ పరమహంసను గురించిన గ్రంథం 1898లో ప్రచురింపబడింది. ఆ రోజులలో శ్రీ రామ కృష్ణ పరమహంస పేరు ఇండియాలో అమెరికాలో,ఇంగ్లండులో బహుళ ప్రచారంలో ఉండేది. ఆయన జీవితాన్ని సందేశాలను పొందుపరుస్తూ

ఒక గ్రంథం వ్రాయడం ఎంతో తనకు ప్రీతికరమైన విషయమని మాక్స్ మూలర్ తన గ్రంథ పీఠికలో ఉదహరించాడు. ఈ గ్రంథ రచనకు ఆయన రామకృష్ణ పరమహంసను గురించి భారత దేశపు వార్తాపత్రికల నుండి ఆ మహాత్ముని ఆంతరంగిక శిష్యులవద్ద నుండి, ఆయన జీవిత కథకూ సందేశాలకూ సంబంధించిన అనేక ఇతర గ్రంథాలనుండి ఎంతో విషయ సేకరణ చేశాడు. ఆధ్యాత్మిక విషయాలను గురించి ప్రచారం చేస్తున్నామనే హఠయోగులు, సన్యాసులు మొదలైనవారిని గురించి మాక్స్‌మూలర్‌కు పరోక్షంగా అయినా క్షుణ్ణంగా తెలుసు. శ్రీరామకృష్ణ పరమహంసలో వీరందరికి మించిన విలక్షణ ఆధ్యాత్మిక లక్షణాలు ఉన్నాయని గ్రహించి శ్రీరామకృష్ణుని సమన్వయాదర్శం తనదిగా చేసుకొన్నాడు.

* * * *

# భారతీయ బంధువులు

మాక్స్‌మూలర్‌కు భారతీయ మిత్రులు అనేకమంది ఉండేవారు. ఆయన భారతదేశానికి మిత్రుడు సన్నిహితుడు కావడంవల్లనే ఇంగ్లండుకు వెళ్ళిన భారతీయులు మాక్స్‌మూలర్‌ను దర్శించడం ఒక మహాభాగ్యంగా భావించుకొనే వారు. మాక్స్‌మూలర్ ఇంగ్లండును దర్శించని భారతీయ మిత్రులతోనూ తరుచుగా ఉత్తరప్రత్యుత్తరాలు సాగిస్తూ ఉండేవాడు.

ఆక్స్‌ఫర్డులో మాక్స్‌మూలర్‌ను దర్శించిన ఆర్. సి. మజుందార్ ఆయన గృహాన్ని ఇలా అభివర్ణించాడు—"[ఆక్స్‌ఫర్డులోని] నార్హామ్ తోటలలోని చెట్లనీడన ఉన్న ఆ 7వ నెంబరు ఇల్లు ప్రాగ్దేశాలనుండి పై చదువులకోసం వచ్చిన విద్యార్థులకు, వ్యాపారంకోసం వచ్చిన వర్తకులకు, విలాసంకోసం వచ్చిన యాత్రికులకు అందరికీ ఒక పుణ్యక్షేత్రం వంటిది."

మాక్స్‌మూలర్‌ను దర్శించడానికి వెళ్లే భారతీయులందరికీ ఏదో నూతనస్ఫూర్తి కల్గేది. ఆయన ఇంట్లో భారతీయనాయకులు స్వయం

వివేకానందస్వామి — "మాక్స్‌మూలర్ మహాశయా! మీరు మా దేశానికి ఎప్పుడు వస్తారు? తమ ప్రాచీనుల భావనలను వెలుగునకు తెచ్చిన మీకు భారతదేశంలో ప్రతి హృదయమూ నీరాజనం పట్టగలదు" అని మాక్స్‌మూలర్‌తో అన్నాడు. దానికి ఆ వృద్ధుని హృదయం ఒక్కసారిగా విప్పారింది. ఆయన నేత్రాలలో ఒక బాష్పకణం తుళక్కుమని మెరిసింది. మృదువుగా శిరఃకంపన చేశాడు. తర్వాత ఆయన తన హృదయ సంస్పందనాలను వాక్కుల రూపంలో ఈ విధంగా వెలువరించాడు — "అక్కడకు వచ్చినప్పుడు నేను ఇక్కడకు తిరిగిరావడం ఉండదు. నన్ను అచటనే దహనం చేయవలెను" అని. మాక్స్‌మూలర్ ఇచ్చిన ఈ సమాధానం గుండెను తాకి స్పందింపజేస్తుంది.

అట్టి మహనీయమూర్తి వివేకానందుని హృదయాన్ని ఆకట్టుకొన్నాడనడంలో ఆశ్చర్యంలేదు. పరవశత్వంలో వివేకానందుడు మాక్స్‌మూలర్‌ను గురించి వ్రాసిన మాటలు చిరస్మరణీయాలు—

"నా యీ పండిత దర్శనం నిజంగా ఒక కనువిప్పు. తమస్సును చీల్చుకొనివచ్చు ఒక తేజోరేఖ. సొగసైన చిన్న ఇల్లు. అందములు వికసించిన ఆ ఉద్యానవనం. పరమ ప్రశాంతమయమై కృపారసవర్షం కురిపించే మోముతో, పలితకేశాల వెండికిరీటం దాల్చిన ఆ మహర్షి డెబ్భైశీతఋతువుల చూచిన ఆఫాలభాగం భావబంధురమై ఒప్పారుతోంది. ఆయన ముఖంలోని ప్రతి రేఖా తన వెనకనున్న అగాధమైన ఆధ్యాత్మిక చింతనను వెల్లడించుచున్నది. సుదీర్ఘ జీవనపథంలో ప్రతికూల శక్తులను, జుగుప్సను ఎదుర్కొని ముందడుగువేసిన భర్తను అనుసరించిన ఆయన ఇల్లాలు, ఆ పుణ్యదంపతుల పరిసర దృశ్యాలు ప్రాచీన భారతీయ మహర్షి లోకాన్ని స్మృతికి తెచ్చి నన్ను పులకితుని చేశాయి. ఆతీవలు, ఆ పువ్వులు, ఆ ప్రశాంత వాతావరణం, ఆ వినిర్మల వినీలాకాశం—ఇవన్నీ ప్రాచీనులైన బ్రహ్మర్షుల, రాజర్షుల పవిత్రకాలానికి, పూజనీయులైన అరుంధతీ వశిష్ఠులు విలసిల్లిన ప్రాచీన కాలానికి నా మనస్సును గొనిపోయినాయి."

"నేను దర్శించింది ఎవరిని? ఒక భాషా తత్త్వవేత్తను కాదు. ఒక మహాపండితుణ్ణికాదు పరమాత్మతో సదా తన సంబంధాన్ని తెలిసి కొన్న ఒక పవిత్రాత్మను ... ... ... ఉప్పునీటి పడియలకోసం ఇతరులు స్వీయశక్తులను వ్యర్థపరుస్తూ ఉండగా ఈతడు జీవిత పథమునందలి తీపినీటియూటను మాత్రమే సేవించినాడు........."

"సకల లోకములను ఊపివేయగల పండితుడు, తత్త్వవేత్త అయిన ఆయన చదువు, తత్త్వదృష్టి పరబ్రహ్మపదార్థమును దర్శించుటకై ఊర్ధ్వ ముఖమునకు గొనిపోయినవి. ఆయన అపరావిద్య పరావిద్యను సమీపించడానికి సహకరించిందనడం నిశ్చయం. సత్యమైన విద్య అంటే ఇదే: "విద్యా దదాతి వినయం"(విద్య ఒసగును వినయము). దివ్యజ్యోతిని దర్శింపజేయని చదువువల్ల ఏమి ప్రయోజనం?"

మాక్స్‌మూలర్‌ను గురించి స్వామీజీ వ్రాసిన పై వాక్యాలు ప్రత్యక్ష పరిచయంగల ఒక మహావ్యక్తి మరో మహావ్యక్తి వ్యక్తిత్వాన్ని చిత్రించి చూపెట్టే శక్తివంతాలైనవి.

1896 సం॥లో 'బ్రహ్మవాదిని' పత్రికలో శ్రీ వివేకానందస్వామి రచించిన "డాక్టర్ పాల్ డూసెన్"ను గురించిన వ్యాసం ప్రకటించబడింది. అందులోనూ స్వామీజీ మాక్స్‌మూలర్‌ను స్మరించాడు. భారతీయ విజ్ఞాననిధిగా ఆయన చేసిన కృషిని విశదీకరించాడు. అందులో— "ఇప్పుడు యూరపు ఖండంలో ఒక కొత్త తరహా సంస్కృత పండితులు సంస్కృత భాషాసానుభూతిపరులు బయలుదేరారు. వారు ఉదార హృదయులు కాబట్టి పూజనీయులు. వారు పండితులు కావున సానుభూతిపరులు. ఈ కొత్తతరహా పండితులకు, తత్పూర్వులకు మధ్యవాడు మన మాక్స్‌మూలర్. పాశ్చాత్య పండితులలో ఈ మాక్స్‌మూలర్‌నకు భారతీయులగు మనం చాలా ఋణపడి ఉన్నాం. ఆయన చిన్న వయస్సులోనే ప్రారంభించిన ఒక మహత్కార్యాన్ని బాగా వృద్ధాప్యం వచ్చిన తర్వాత ముగించారని విన్నప్పుడు నేను చాలా ఆశ్చర్యపడ్డాను. ఈ మహాకార్య నిర్వహణంలో ఆయనకు అన్యుల సహాయమేదీ లేదు. తాళపత్ర

గ్రంధాలు చదవడానికి భారతదేశంలో కూడా జీవితకాలమంతాపడుతుంది. పోనీ ఏ పేదపండితుని సహకారమైనా ఈయనకు ఉందంటే అదీ లేదు. (అమెరికా దేశస్థులు మన పండితులను గురించి ఇట్లా చెప్పారు: "నెలకు పది షిల్లింగులిచ్చో లేక తాను ప్రకటించు నూతన పరిశోధనా గ్రంథముయొక్క పీఠికలో అతని పేరు ప్రస్తావించో ఒక భారతీయ పండితుని చేత పని చేయించుకో వచ్చును.") అట్టి పరిస్థితులలో ఈ మాక్స్‌మూలర్ రోజుల తరబడి, నెలల తరబడి, సాయణ భాష్యములోని ఒక పదంయొక్క లేదా వాక్యంయొక్క అర్థమును వివరించుటకు పనిచేసెడివాడు. ఈ సంగతి ఆయనే ఒకసారి నాతో చెప్పాడు. చిట్ట చివరకు ఆయన వైదిక సాహిత్య మహారణ్యంలో సుఖప్రచార యోగ్యమైన రాజమార్గమును నిర్మింపగలిగాడు. ఈ పాశ్చాత్యుడు చేసిన ఈ మహాకార్యాన్ని గురించి కొంచెం ఆలోచించండి. ఆయన మనకెంత ఉపకారియో తెలుస్తుంది. ఆయన వ్రాసిన అనేక విషయములతో, చేసిన బహువ్యాఖ్యానములతో మనం ఏకీభవించవచ్చు ఏకీభవించకపోవచ్చు. అట్లు ఏకీభవించుట నిజముగా అసంభవం. ఏకీభావమున్నా, లేకపోయినా మనలో ఎవరైనా చేయడానికి స్వప్నంలోకూడా ఊహించడానికి వీల్లేని ఈ మహాకార్యాన్ని, మా తాత తండ్రులయొక్క ఈ మహా సారస్వతాన్ని రక్షించడానికి, వ్యాపింపజేయడానికి ఆయన ఒంటరిగా లక్షపనులు చేశాడు. ఇది అంతా ఆయన భక్తిప్రపత్తులతో పరిపూర్ణహృదయంతో చేసిన పనేగాని వట్టి స్వార్థంతో చేసిన పనికాదు.

అదేవ్యాసంలో మాక్స్‌మూలర్, పాల్‌డూసెనుల కృషిని పోలుస్తూ స్వామీజీ ఇలా వ్రాశాడు— "మాక్స్‌మూలర్ ఈ నూతనోద్యమానికి తొలినాయకుడైనచో డూసెన్ ఆ ఉద్యమంయొక్క అభివృద్ధి దశలోని వాడు. మన వేదములందున్న ఆధ్యాత్మిక సిద్ధాంతరత్నాలు భాషాశాస్త్ర విషయిక పరిశోధనలలో మరుగుపడిపోయినాయి. మాక్స్‌మూలర్ ఆ రత్నాలను కొన్నిటిని పైకి తెచ్చి పదిమందికి చూపించినాడు. ఆయన భాషా శాస్త్రవేత్తలలో అగ్రగణ్యుడు కావడంవల్ల ఆరోజుల్లో ఈ సత్యాలవంకకు ఇతరుల దృష్టిని ఆకర్షింపగల్గాడు. డూసెన్‌కు ఆ భాషా

శాస్త్రసంబంధమైన పిచ్చిలేదు. ఈయన ప్రాచీన గ్రీకు, అధునాతన జర్మనీ తత్త్వశాస్త్రములందు విశిష్టమైన పండితుడు. అదేకాక ఉపనిషత్తుల సిద్ధాంతములందు మునిగి వానియాదార్థ్యాన్ని గమనించి లోకానికి చాటినవాడు."

రమేశ్ చంద్రదత్తుకు మాక్స్‌మూలర్‌కు స్నేహార్ద్ర సంబంధాలు ఉండేవి. రమేశ్‌చంద్రదత్తు ఆనాటి భారతీయ నాయకుడు. మాక్స్‌మూలర్ మరణానంతరం ఆయన లండన్‌నగరంలో 1900 సం॥లో నవంబర్ 23వ తేదీన "ది ఇంగ్లీషు గెథె సొసైటీ"లో ఏర్పాటుచేసిన సంతాప సభలో ఒక ప్రసంగం చేశాడు. ఆ ప్రసంగంలో మాక్స్‌మూలర్ తూర్పును పడమరకు తెలియపరచడమేకాక తూర్పును తూర్పుకూ తెలియపరిచాడని రమేశ్‌చంద్రదత్తు అంటాడు. 1888సం॥లో ప్రచురించిన "ప్రాచీనభారతీయ సభ్యత" (Civilization of Ancient India) అనే తన గ్రంథపు తొలిపలుకులో మాక్స్‌మూలర్ ఋగ్వేద సంపుటాల ప్రచురణ గతకాలపు విషయావగాహనలో చారిత్రకదృష్టిని పెంపొందించిందని అన్నాడు. రమేశ్‌చంద్ర ప్రచురించిన మహాభారత ఆంగ్లానువాదానికి మాక్స్‌మూలర్ ముందుమాట వ్రాస్తూ, ఆ అనువాదం "a snap shot of the old poem" అని ప్రశంసించాడు. మాక్స్‌మూలర్ జీవించిఉండగానే రమేశ్‌చంద్ర తాను చేసిన రామాయణానువాదాన్ని తనను ఎంతగానో ప్రోత్సహించిన మాక్స్‌మూలర్‌కు తన గౌరవ చిహ్నంగా అంకితం చేశాడు.

రమేంద్ర సుందరత్రివేది "చరిత్‌కథా" అనే పేరున రచించిన జీవిత సంగ్రహాల సంపుటంలో మాక్స్‌మూలర్ జీవితాన్నికూడా పొందు పరిచాడు. ఇది ఒక మహాపండితునికి కైమోడ్పు ఘటించడమే కాదు. భారతదేశాన్ని ఎంతగానో ప్రేమించిన, భారతదేశానికి అనేక విధాలుగా సేవచేసిన జర్మనుపండితునకు ఒక భారతీయ రచయిత గౌరవాంజలి సమ ర్పించడంకూడా. ఆ గ్రంథంలో మాక్స్‌మూలర్ ప్రత్యేకతలను ఆయన విశిష్ట విలక్షణ లక్షణాలను చక్కగా రచయిత చిత్రించాడు. అనేకమంది పాశ్చాత్య పండితులు భారతదేశపుగతాన్ని అన్వేషించడానికి యత్నించా రనీ, కాని మాక్స్‌మూలర్ మాత్రం భారతదేశపు గత వర్తమానాలను

రెంటినీ విశితంగా పరిశీలించాడనీ రమేంద్రసుందర్ వివరించాడు. ఇది సత్యం. సజీవ వర్తమాన భారతంతో ఆనాడు మాక్స్‌ముల్లర్‌కు పరిచయం ఉండటం వల్లనే ఆనాటి భారతీయుల హృదయాలపై తన ఆలోచనలతో ఒకముద్ర వేయగలిగాడాయన. రమేంద్ర సుందర్ తన గ్రంథంలో మరో విశేషం చెప్పాడు. బాలగంగాధర తిలక్ జైలులో ఉండగా మాక్స్‌ముల్లర్ ఆయనకు ఋగ్వేద సంపుటాలసెట్టు బహుకృతిగా పంపినట్లు వ్రాశాడు. "మాక్స్‌ముల్లర్ జీవితం: లేఖలు" (Life and Letters of Max Muller) అనే గ్రంథంలో శ్రీమతి మాక్స్‌ముల్లర్ తన భర్త తిలక్ విషయమై సర్ జాన్ లుబ్బోక్‌కు వ్రాసిన లేఖను ఉదహరించింది. ఆలేఖలో మాక్స్‌ముల్లర్ తిలక్ మహాశయునకు జైలులో వారి బైబిలును (ఇచ్చట మత పవిత్ర గ్రంథం అనే అర్థంలో 'బైబిలు' అనే పదం ప్రయోగింపబడింది). ప్రార్థనా గీతాల గ్రంథాన్ని చదవడానికి అవకాశం ఇవ్వలేదని విచారం వ్యక్తపరుస్తూ తన ఆక్షేపణ తెలియపరిచాడు.

మాక్స్‌ముల్లర్ "నా భారతీయ స్నేహితులు" అనే గ్రంథంలో ద్వారకానాథటాగూరు, రాజారాధాకాంత దేవ బహదుర్, నీలకంఠగోరె, కేశవచంద్రసేన్, రామతనులాహిరి, దయానందసరస్వతి, రామకృష్ణ పరమహంస, బెహ్రామ్జీ మలబారి, రమాబాయి, ఆనందీబాయి జోషుల జీవిత సంగ్రహాలను పొందుపరిచాడు.

అత్యంత ప్రేమాభిమానాలు భారతదేశంపట్లఉన్నా భారతదేశాన్ని మాక్స్‌ముల్లర్ సందర్శించకపోవడం చాలా మందికి విచిత్రంగా కన్పిస్తుంది ఆయన అంతరాంతరాలలో భారతదేశాన్ని సందర్శించాలనే ఔత్సుక్యం ఉంది. ద్వారకానాథ టాగూరుకు వ్రాసిన లేఖలో మాక్స్‌ముల్లర్ ఇలా వ్రాశాడు—"ప్రాచీన భాషా పండితుడు రోము నగరాన్ని ఏథెన్సునూ సందర్శించడానికి కుతూహలపడినట్లు, నేనూ కాశీపట్టణం చూడాలని అక్కడ పవిత్ర గంగానదిలో జలకమాడాలని ఆశించాను, కాని ఆ కాలంలో అటువంటి విషయం ఆచరణసాధ్యం కాలేక పోయింది". ఆయన ఊహాలో కల్పన చేసుకొన్న భారతదేశపుమూర్తి వాస్తవిక భారత

దేశ సందర్శనంవల్ల చెదిరిపోతూందేమోనని భావనకూడా ఆయన భారత దేశ సందర్శనా సంకల్పాన్ని వెనుకకు నెట్టింది. గౌర్ గోవింద ఉపాధ్యాయ బెంగాలీలో రచించిన కేశవచంద్ర సేనుని జీవిత చరిత్రలో ఒక ముఖ్య సంఘటన చిత్రింపబడింది. కేశవ చంద్ర సేన్ ఇంగ్లడు వెళ్ళినప్పుడు ఆక్స్‌ఫర్డులోవున్న మాక్స్‌మూలర్‌ను సందర్శించడానికి వెళ్లాడుట. ఆ సమయంలో మాక్స్‌మూలర్ తన ఇంట్లో గ్రంథాలతో వ్రాత ప్రతులతో నిండి ఉన్న ఒక గదిలో కూర్చొని, ఋగ్వేదం మొత్తంమీద ఉన్న అకారాంత శబ్దాలన్నింటిని సేకరిస్తూ జాబితాను తయారు చేయడంలో నిమగ్నుడై యున్నాడట. అతిథిగా వెళ్ళిన కేశవచంద్రునకు ఆ అతిథేయుడగు మాక్స్‌మూలర్ కాశీ నివాసియగు పండితునివలె కన్పించాడట. అభావం స్ఫురించగానే 'తమరు ఇంతవరకు పవిత్రమైన కాశీపట్టణం దర్శించక పోవడానికి కారణం ఏమిట'ని కేశవ చంద్రుడు ప్రశ్నిస్తే మాక్స్‌మూలర్ దానికి సమాధానంగా ఇలా అన్నాడట— "నేను సర్వకాల సర్వావస్థలలోనూ కాశీలోనే ఉంటాను నా ఇంటినే కాశీగా ఊహించుకోవడం నాకు ప్రీతికర విషయం భౌతికమైన కాశీపట్టణాన్ని నా యీ భౌతిక నేత్రాలతో చూడాలనే ఇచ్ఛ నాకులేదు. ఆ పట్టణాన్ని గురించి నాకు గల భావం చాలా మహత్తరమైంది అందుకని మామూలు కాశీకోసం భ్రాంతుడనై ఇరుకున పడటానికి ఇచ్ఛగించను" అని. ద్వారకానాథ టాగూరుపై వ్రాసిన వ్యాసంలో గంగాతీర ఘట్టాలలో పిల్లలు, స్త్రీలు, పురుషులు పవిత్ర గంగా జలాలలో మునకలిడుతున్న సంఘటనను చూడలేకపోయినా పవిత్ర భారత దేశమాతకు జన్మించిన లోకోత్తరులైన కుమారులను కుమార్తెలను ఐరోపా ఖండంలో ఉండేవారి ఇంగ్లండురాకవల్ల చూడగలిగానని సంతృప్తిపడ్డాడు.

మాక్స్‌మూలర్‌ను మొదట్లో బాగా ఆకర్షించిన భారతీయుడు రామమోహనరాయ్. రామమోహనుడు ఆయన దృష్టిలో ఒక మహావ్యక్తి. మానవలోకానికి కళ్యాణం కూర్చిన మహానుభావునిగా తోటికార్యకర్తల చేత, అనుయాయులచేత నిరంతరం స్మరింపబడే పేరు ప్రతిష్ఠలు ఆయన గడించుకోగలిగాడని మాక్స్‌మూలర్ భావించాడు. రామమోహనరాయ్

8)

బిరుదు 'రాజా'. బిరుదుతో కలుపుకొని ఆయన రాజారామమోహనరాయ్ అని పిలవబడుతూ ఉండేవాడు. మాక్స్‌మూలర్ రామమోహనరాయ్ నిజమైన 'రాజా'యే అని వివరిస్తూ ఇలా అంటాడు — "రాజ కుమారునికి జర్మనీ భాషలో పుర్‌ష్ట్ (furst) అని అంటారు దానిని ఇంగ్లీషులో చెప్పాలంటే 'ఫష్ట్' (first). దీనికి అర్థం అన్నిటా ముందుగా ఉండేవాడు; అపాయకరమైన ప్రదేశాలలో సైతం ముందుకు ఉరికేవాడు; బాహో బాహీ హో రాహోరీ సమరానికి ముందు తలబడేవాడు; వెనుకంజ వేయడంలో ఆఖరివాడు అని. అలాంటి 'first' రామమోహనరాయ్. అతడు నిజమైన 'రాజా'. రాజా అంటే 'రెక్స్' (Rex) వంటి వాడన్నమాట. 'రెక్స్' అంటే ముందుండి విషయ నిర్వహణ చేసేవాడు. తారస్థాయిలో ఉండే పెద్దమనిషి అని అర్థం" మాక్స్‌మూలర్ మనిషి గొప్పతనాన్ని సరిగ్గా అర్థం చేసుకొనే అంచనా వేస్తాడు. రామమోహనుడు గొప్పవాడు అని ఆయన అంగీకరించాడంటే రామమోహనుని కృషిలోని మహత్త్వం ఆయనను ఆకర్షించిందన్న మాట. రామమోహనుని వ్యక్తిత్వాన్ని మాక్స్‌మూలర్ ఇలా చిత్రిస్తాడు — "రామమోహనుని సర్వకార్యకలాపాలలో ప్రశాంతమైన సాహసం, నిర్దిష్టమైన ఋజుమార్గగమనం ఉంది. కొందరు మిత్రులు అతన్ని అపార్థం చేసుకొన్నారు. కొందరు అతన్ని మహమ్మదీయునిగా, మరికొందరు క్రైస్తవునిగా భావించారు. రామమోహనరాయ్ యూరపుకు బయలుదేరే ముందు తాను మరణించినపుడు ఎవరికి వారే వారివారి దృష్టిని బట్టి తనను గురించి క్రైస్తవుడని, మహమ్మదీయుడని, హిందువని భావిస్తారని చెప్పుకొన్నాడు కాని, ఆయన యీ మతాలలో దేనికీ చెందడు. ఆయన మతభావనలు అయన జీవితకాలంలో రచించి ప్రచురించిన ఒక కరపత్రంలో పొందుపరచబడి ఉన్నాయి. ......................ఈ కరపత్రం ఆయన ఏకేశ్వర భావనను, ఆ ఈశ్వరునికిగల అనంత కళ్యాణ గుణ సంపన్నతను, శక్తిమత్త్వాన్ని నిత్యమగుఆత్మాస్తిత్వ భావనను వివరిస్తుంది...................... సంకుచిత మనస్తత్వంగల మనుష్యులు ఏమైనా అననీ, నేను మళ్ళీ చెప్పేది ఇది. రామమోహనరాయ్ నిస్వార్థుడు, ఉదారుడు, సాహసి—

నిజమైన అర్థంలో పెద్దమనిషి." రామమోహనుడు మాక్సుమూలర్‌పై అలాంటి ప్రభావముద్ర వేయగలిగాడు.

మాక్సుమూలర్ పారిస్ నగరంలో ఉన్నప్పుడు రవీంద్రనాథ టాగూరు తాత, దేవేంద్రనాథ టాగూరు తండ్రి అయిన ద్వారకానాథ టాగూరు మిత్రుడయ్యాడు. ఆ రోజులలో భారతీయులు సముద్రందాటి వెళ్ళడమంటే మతదృష్ట్యా నిషేధాలుండేవి. ఏవో భయంకరమైన ఊహాలు సముద్రయానాల్ని గురించి ఉండేరోజులవి. అలాంటి రోజులలో 1844 సం॥లో హిందూదేశస్థుడగు ద్వారకానాథటాగూరు పారిస్‌నగరంలో ప్రత్యక్ష మయ్యాడు. ముఖ్యంగా ఈ సాహసకృత్యం ద్వారకానాథునితో పరిచయం చేసుకోవాలనే కోరిక మాక్సుమూలర్‌లో కలిగించింది. ద్వారకానాథుడు గొప్ప అందగాడు. పారిస్‌లోని ప్రసిద్ధమైన హోటలులో బసచేశాడు. పారిస్‌లో ఆయన ఉనికి సహజంగానే ఔత్సుక్యాన్ని రేకెత్తించింది. ఆ సమయంలో "College de France"అనే కళాశాలలో ఆచార్యబొర్నాఫ్ ఇస్తున్న ఉపన్యాసాలకు మాక్సుమూలర్ హాజరవుతూ ఉండేవాడు. ద్వారకా నాథుడు బొర్నాఫ్ వద్దకు కొన్ని పరిచయలేఖలు తెచ్చాడు. కొత్తగా భారతదేశం నుండి వచ్చిన ఆ ఆగంతకుణ్ని బొర్నాఫ్ మాక్సుమూలర్‌కు పరిచయంచేశాడు. తర్వాత ద్వారకానాథునితో మాక్సుమూలర్‌తో సాన్నిహిత్యం పెరిగి స్నేహబంధంగా పర్యవసించింది. ద్వారకానాధునికి సంస్కృతం బాగారాదు. అయినా ఆయనకు సంస్కృత సాహిత్యంతో సంబంధం లేకపోలేదు. "Institute de France"లో బొర్నాఫ్ మహాశ యుడు తాను వెలువరించిన భాగవతపురాణసంపుటాన్ని ద్వారకానాధునికి బహూకరించిన సందర్భంలో మాక్సుమూలర్ అక్కడే ఉన్నాడు. ద్వారకా నాథుడు హిందూమతాన్ని బాగా అధ్యయనం చేసిన పండిత ప్రకాండుడు కాకపోయినా, సంస్కృత భాషలో బాగా వైదుష్యం లేకపోయినా వేద వ్రాతప్రతుల మాతృకలనుండి ప్రతికలను తయారు చేసుకొనడం, వాటిని పోల్చి పరిశీలించడం, వాటి పాఠభేదాలను విమర్శించుకొనడం మొదలైన పనులు మాక్సుమూలర్ అతిశ్రద్ధగా తీవ్ర జిజ్ఞాసతో కొనసాగి స్తున్నాడని బొర్నాఫ్ చెప్పగా విని చాలా ఆనందించాడు. దానితో మాక్స

మూలర్ అంటే ఆయనకు మరింత అనురాగం, ప్రత్యేకాభిమానం ఏర్పడ్డాయి. మాక్స్‌మూలర్‌ను తన బసకు ఆహ్వానించాడు. అనేక ఉదయాలు మాక్స్‌మూలర్ ద్వారకానాథులు కలిశారు. భారతదేశాన్ని గురించి, భారతీయ ఆచార వ్యవహారాలను గురించి చర్చించారు. ద్వారకానాథునికి సంగీతం అంటే బాగా ప్రీతి. ఇటాలియను, ఫ్రెంచి సంగీతాలంటే రుచి ఏర్పడింది. పియానోవద్ద తన పక్కనే కూర్చొని సహకరించవలసిందని మాక్స్‌మూలర్‌ను ద్వారకానాథుడు కోరుతూఉండేవాడు. మాక్స్‌మూలర్‌కూ ద్వారకానాథుని మధురగాత్రమంటే ఆకర్షణ. ఒక ఉదయం ఆయనను నిజమైన భారతీయ సంగీతానికి ఒక మచ్చుతునక పాడి విన్పించమని మాక్స్ మూలర్ కోరాడు. వెంటనే భారతీయమైనదంటూ ఒక పరియను సంగీత రచన విన్పించాడు. అలాకాదు నాకు ప్రత్యేకంగా భారతీయ సంగీతం విన్పించాలని పట్టుపట్టి మాక్స్‌మూలర్ కూర్చుంటే—"మీరు దాన్ని మెచ్చుకోలేరు" అని ద్వారకానాథుడు అన్నాడు. మళ్ళీ మళ్ళీ అడిగి బలవంతం చేయడంవల్ల పియానోవద్ద కూర్చుని ద్వారకానాథుడు ఎవోకొన్ని స్వరాలు పలికించాడు, పాడటం ప్రారంభించాడు. ఆ పాడినదానిలో మాధుర్యం, స్వరసమ్మేళనం మాక్స్‌మూలర్‌కు సరిగ్గా ఉన్నట్లు అన్పించలేదు. ఆమాట దాచుకోకుండా ద్వారకానాథునికి మాక్స్‌మూలర్ చెప్పాడుకూడా. ఆ ఆక్షేపణ విని ద్వారకానాథుడు—"మాక్స్‌మూలర్! ఈ విషయంలో మీరందరూ ఒక్కటే. మీకు వింతగా తోచిన కొత్త విషయాలను ఒక్కసారిగా మీకు సంతృప్తిని కలిగించలేదని కొట్టిపారేస్తారు. దానినుండి పరాఙ్ముఖులవుతారు. నేను మొదటసారిగా ఇటాలియన్ సంగీతం విన్నప్పుడు అది సంగీతమనే అన్పించలేదు. మరల మరలవింటూవచ్చాను. అదంటే అప్పటికి ఇష్టం ఏర్పడింది. దానిని మీరు అవగాహనచేసుకొనడం అంటారు. ఇదే సత్యం అన్ని విషయాలలోనూపట్టిస్తుంది. మీరు మామతం మతంకాదంటారు. మాకవిత్వం కవిత్వంకాదు పొమ్మంటారు. మాతత్త్వశాస్త్రం తత్త్వమేకాదనంటారు మేం యూరపు ఉత్పత్తిచేసినదాన్ని దేనినైనా అర్థంచేసుకోడానికి, ఆస్వాదించడానికి యత్నిస్తాం. అలా అని భారతదేశం ఉత్పత్తి చేసినవాటిని కించపరుస్తామని కాదు. మీరు మా సంగీతాన్ని అవగాహన చేసుకొంటూ అధ్య

యనం చేసినట్లయితే మీరూ మా సంగీతంలోని లయవిన్యాసం, మాధుర్య మరందం, స్వరసమ్మేళన వైభవం ఉన్నట్లు తెలుసుకోగలరు. ఆస్వాదించ గలరు." ఇలా ధారాళంగా చెప్పుకొంటూ పోతూంటే ఆయనను శాంతం పరచడానికి మాక్స్‌మూలర్ భారతదేశ సంగీతశాస్త్ర మహత్త్వాన్నిగురించి కొంత తనకు తెలుసుననీ, అది గణితశాస్త్రంపై ఆధారపడి బాగా వికసిం చిందని చెప్పాడు.

ఒకనాడు ద్వారకానాథుని మాక్స్‌మూలర్ ఇలా అడిగాడు—"మీరు భారతదేశానికి తిరిగి వెళ్ళిన తర్వాత తపస్సు చేయాలా లేదా ప్రాయ శ్చిత్త కర్మ చేయించుకోవాలా?" అని. దానికి ద్వారకానాథుడు పకపకా నవ్వి. ఇలా సమాధానం చెప్పాడు— "ఆఁ. అవసరంలేదు. నేను మా యింటివద్ద పెద్దబ్రాహ్మణుల గుంపును భోజనాదికంపెట్టి మేపుతున్నాను. ఈ తపస్సు చాలు."

ద్వారకానాథుడు పారిస్‌లో ఉన్నప్పుడు ప్రాగ్దేశ పద్ధతిలో హుందాగా గడిపాడు. అప్పటి ఫ్రెంచిరాజు లూయీ ఫిలిప్పె ఆయనకు ఆహ్వానం చెప్పి గౌరవించాడు. ఒకనాటి సాయంత్రం తన ఆస్థానంలో పెద్దపెట్టున ద్వారకానాథుని గౌరవార్థం ఫ్రెంచిరాజు విందు ఏర్పాటుచేశాడు. ఆ హాలు అంతా భారతదేశపు శాలువాలతో నిండి ఉంది. ఫ్రెంచివనితల ఆశకు పెన్నిధులు ఆ శాలువాలు. వాళ్ళందరినీ ఆనందోత్సాహాలతో నింపిన విషయం ఏమంటే ఆ హాలు విడిచి వెళ్ళేటప్పుడు రాజా ద్వారకానాథ టాగూరు ఆ ఫ్రెంచి వనితామణుల బుజాలమీద ఆ శాలువాలుకప్పి అలంక రించడం.

మాక్స్‌మూలర్ వ్రాసిన ప్రకారం ద్వారకానాథుడు ఇంగ్లండులో ఉన్నప్పుడు రామమోహన్‌రాయ్ స్మృతిచిహ్నంగా ఒక పవిత్ర కార్యాన్ని నిర్వహించాడు. బ్రిష్టల్‌లో రాజా రామమోహనరాయ్ చితాభస్మంమీద అచ్చటి స్మశానవాటికలో ఒక సమాధిని కట్టించడం.

ద్వారకానాథుడు ఇండియాకు తిరిగి వెళ్ళినప్పుడు తన కుమారుడు దేవేంద్రనాథటాగూరుకు మాక్స్‌మూలర్ యొక్క వేదప్రీతిని గురించి చెప్పాడు. మతం అంటే ప్రీతిగల సంస్కరణాభిలాషియైన దేవేంద్ర నాథునికి మాక్స్‌మూలర్ అంటే పరోక్షస్నేహం ఏర్పడింది. దేవేంద్ర నాథుడు మాక్స్‌మూలర్‌ను ఎప్పుడూ చూడటం తటస్థపడలేదు. మాక్స్ మూలర్ దేవేంద్రనాథుని భౌతిక రూపంతో పరిచయం లేకపోయినా, ఉత్తర ప్రత్యుత్తరాలు వారి మధ్య నడవడంవల్ల ఆయన భావనారూపంతో సుస్పష్ట పరిచయం ఏర్పడింది. తనదేశపు మతానుయాయులలోగల కుళ్లను కడిగివేయాలనే సంకల్పం కల్గిన సంస్కరణాప్రియుడు దేవేంద్ర నాథుని కృషి అంటే మాక్స్‌మూలర్‌కు అపారమైన సానుభూతి కలిగింది.

ఋగ్వేద ప్రచురణానంతరం రాజా రాధాకాంతదేవ్ అనే బెంగాలీ జమీందారుతో ఉత్తరప్రత్యుత్తరాలు సాగాయి. రాజా రమాకాంతదేవ్ ఆ రోజులలో 'శబ్దకల్పద్రుమా'న్ని ఏడుసంపుటాలుగా ప్రచురించాడు. ఆ సంపుటాలను మాక్స్‌మూలర్‌కు కానుకగా పంపించాడు. ఆ బహూకృతికి చాలా ఆనందించాడు మాక్స్‌మూలర్. బ్రహ్మసమాజనాయకులైన దేవేంద్రనాథటాగూరు, కేశవ చంద్రసేన్‌వంటి వారు వారి అనుయాయుల మాట అలా ఉంచి పూర్తిగా ఛాందసంగా ఏ మార్పు హర్షించని సంప్ర దాయ వాదులు కూడా భారతదేశంలో ఉండేవారు. వారికి ఋగ్వేదసంపు టాలను ముద్రించడమే గిట్టదు. అందులోనూ వారు పాశ్చాత్యులను సనా తనులు భావించే రీతిగా మాక్స్‌మూలర్‌వంటి మ్లేచ్ఛుడు ఆ పనికి పూనుకో వడం మరీ ఆక్షేపణీయం. ఈ వర్గం మాక్స్‌మూలర్‌ను తీవ్రంగా వ్యతిరే కించినమాట వాస్తవం. ఈ సంప్రదాయవాదులగు సనాతనులవర్గంలో కూడా కొంత ముందుకుపోయి ఆలోచించగల సహృదయులు, అభ్యుదయ కర భావనలు గలవారు ఉన్నారు. అందులో రాధాకాంతదేవ్ ఒకడు. రాధాకాంతదేవ్‌బహదుర్‌నుండి ఋగ్వేదప్రచురణ విషయమై మాక్స్ మూలర్‌కు అభినందనలు అందాయి. రాధాకాంతదేవ్ వ్రాసిన లేఖలో —"మాక్స్‌మూలర్! ఈ బృహత్తర కార్యక్రమాన్ని స్వీకరించి, విజయ వంతంగా నిర్వహించడం మూలాన, హిందువులకు మీరు వారికి తమ

పవిత్ర గ్రంథమగు ఋగ్వేదపు పరిష్కృత ప్రతిని ముద్రింపజేసి ఇచ్చి. విలువ కట్టడానికి వీల్లేనంత సేవచేశారు" అన్న ప్రశంసావాక్యం ఉంది. ఇలా రాధాకాంతదేవ్ మెచ్చుకొంటూ వ్రాయడం మాక్స్‌మూలర్ చాలా ముఖ్యమైన విషయంగా భావించాడు. దానికి కారణం ఇది. రాధాకాంతదేవ్ ఒక తరహా సనాతనుల వర్గానికి నాయకుడు.

ఇలా ఋగ్వేదసంపుటాలప్రచురణ భారతీయులలో ఆయనపై గొప్ప గౌరవభావాన్ని పెంపొందించింది. ఒకసారి దేవేంద్రనాథటాగూరు మాక్స్‌మూలర్‌కు వ్రాసిన లేఖలో— "ఋగ్వేదం, ఉపనిషత్తులు, ప్రచురించడం ద్వారా ఐరోపాఖండపుపండితమండలిలో మా ప్రాచీన ఋషుల భావనలను అందుబాటులోనికి తెచ్చారు." అని ఆయనను అభినందించాడు. మాక్స్‌మూలర్ డెబ్బయోపడిలో ఉండగా భారతీయ పండిత బృందం ఆయనకు ఒక అభినందనపత్రం పంపింది అందులో ఆ పండితులు— "గత అర్ధశతాబ్దంగా జాతి, మత, కుల పక్షపాతాలనుండి విముక్తులై మానవజాతి సమైక్యానికి నడుంకట్టిప్రయత్నాలు జరుగుతున్నాయి. అనేకమంది ఐరోపాఖండపండితులు ఈ పనికి ఉద్యమించి కృషిచేశారు. అందులో మీకొక విలక్షణ స్థానం ఉందని మాక్స్‌మూలర్‌ను అభినందించారు.

ఇలా మాక్స్‌మూలర్‌ను ప్రశంసించిన భారతీయులేకాక ఆయన సిద్ధాంతాలను వ్యతిరేకించినవారూ ఉన్నారు. మాక్స్‌మూలర్ అంటే గౌరవభావం ఉన్నా ఆయన సిద్ధాంతాలు వారికి రుచించలేదు. అందులో ఆర్యసమాజ ప్రవక్త దయానందసరస్వతికి మాక్స్‌మూలర్ వైదికసారస్వతాన్ని గురించిన భావనలు ఏమాత్రం నచ్చవు. అలాగే సుప్రసిద్ధ బెంగాలీకవి వందేమాతర మంత్రద్రష్ట బంకించంద్ర చటర్జీ హృదయాన్ని మాక్స్‌మూలర్ సిద్ధాంతాలు అలరించలేదు. బంకించంద్రచటర్జీ "ప్రచార్" అనే హిందూమత విషయిక పత్రికలో మాక్స్‌మూలర్ ఋగ్వేదదైవాలను గురించి ప్రతిపాదించిన 'Henotheism' అనే సిద్ధాంతాన్ని తీవ్రంగా విమర్శించాడు. 'హెనోథీయిజమ్' అంటే అగ్ని, వరుణుడు,

ఇంద్రుడువంటి దైవాలలో ఏ దైవాన్ని ఉద్దేశించి ప్రార్థించేటప్పుడు ఆ ప్రార్థనాసమయంలో ఆ దైవాన్ని పెద్దచేసి కీర్తించడం అని వివరించుకో వచ్చు. 1894 సం॥లో "వైదికసారస్వతం" (Vedic Litarature) అనే వ్యాసాన్ని కలకత్తా యూనివర్శిటీ పత్రికలో బంకింబాబు వ్రాశాడు. ఆ వ్యాసంలో - మాక్స్‌మూలర్‌వంటి ఐరోపాపండితులు వేదాధ్యయన ప్రాధాన్యాన్ని గురించి ఘంటాపదంగా చెప్పారు. కాని వారి దృక్పథం ఐరోపా దృక్పథం మాత్రమే. ఆ దృక్పథం భారతదేశవాసులమైన మనకుగల వేదాధ్యయన జిజ్ఞాసకు ఏ రీతిగానూ ప్రాతినిధ్యం వహించదు" అని వ్రాశాడు బంకింబాబు.

కేశవచంద్రునికి మాక్స్‌మూలర్‌కు గాఢపరిచయం ఉంది. మాక్స్ మూలర్‌కు ముఖ్యంగా కేశవచంద్రుని బ్రహ్మసమాజ ఉద్యమమంటే అత్యంత అభిమానం ఉంది. కేశవచంద్ర సేనాదుల సంస్కారప్రియత్వం నానక్, కబీరు, చైతన్యమహాప్రభువుల భావధారకు దగ్గరలో ఉంటుందని ఆయన భావించాడు. చైతన్యమహాప్రభుని సంస్కరణలో వర్ణవిభేదపు నడ్డివిరగగొట్టడానికి యత్నం జరిగింది. చైతన్యుడు అంటూ ఉండేవాడట- "కేవల వేదాధ్యయనపరుడు నాశిష్యుడుకాడు. నమ్మకస్థుడైన చండాలుడు నాస్నేహానికి పాత్రుడు" అని. విగ్రహారాధనకు మించిన మానసికపూజ నానక్ ఆశించాడు. నానక్". ఎక్కడికి పోనునేను? ఇంటివద్దనే నాకు ఆనందంగా ఉంది. నాహృదయం నావెంటరాదు. అది వికలాంగ అయిపోయింది. ఏదో ఒకరోజున నాహృదయంలో వెళ్ళాలని అభిలాష జనిస్తుంది. అప్పుడు చందనం అరగతీస్తాను. రోజాల అత్తరును ఇంకెన్నో సుగంధద్రవ్యాలను చేకొంటాను. బ్రహ్మాన్ని దేవాలయంలో ఆరాధించడానికి ముందుకు సాగుతాను. కాని నాగురువు ఈశ్వరుడు నాహృదయంలోనే ఉన్నాడని చెప్పాడు. నానక్ భావనలు ఇలా నడుస్తాయి. కబీరు మహాసమన్వయ ప్రవక్త, హిందువుల ముస్లిముల ఐక్యతకు కృషి చేశాడు. సామాజిక దోషాలను, మతమూఢత్వాలను తూర్పారబడుతూ ఎగరగొట్టేశాడు. ఒకసారి కబీరు ఇలా బోధచేశాడు- "కాముకత, అతికోపం, గర్వం అన్నీ విడిచిపెట్టు. కేవల మతకర్మ కలాపాలవల్ల దాపరికం ఉత్పన్నమైంది. వెళ్ళి

ఒకరాయిని పూజిస్తే మోక్షం వస్తుందని భావిస్తున్నారు. తాను కేవలం సేవద్వారానే భగవానుణ్ణి పొందానని, హృదయం నిరాడంబరం చేసుకొని దేవదేవుని పొందానని కబీరు చెబుతున్నాడు. వినండి." ఇలాంటి పూర్వసంస్కారల భావనలు రామమోహనరాయ్‌ని, కేశవచంద్రసేనుని ఆకర్షించాయి. కేశవచంద్రుని సంస్కరణోద్యమపు తీరుతెన్నులు,నిరాకార పరబ్రహ్మోపాసనా విధానాలు మాక్స్‌మూలర్‌కు క్షుణ్ణంగా తెలుసు. కేశవ చంద్రుడు ఇంగ్లండు వెళ్ళినప్పుడు ఆయన ఆధ్యాత్మిక వ్యక్తిత్వం, ధారాళమైన వక్తృత్వం అక్కడ చాలామందిని ఆకర్షించింది.ఆక్స్‌ఫర్డులో ఆయన ఉపన్యాసం ఒకటి ఏర్పాటు చేద్దామని మాక్స్‌మూలర్ సంకల్పించాడు. ఆక్స్‌ఫర్డులో ప్రధానుడగు పూసే మహాశయునితో ఆ బ్రహ్మసమాజ నాయకుడగు కేశవచంద్రుని ప్రసంగం విద్యార్థులకు ఏర్పాటు చేయమని సూచన చేశాడుకూడా. ప్రసంగం ఏర్పాటు చేయడం సంభవపడలేదుగాని పూసే మహాశయుడు ఆక్స్‌ఫర్డుకు ఆర్థ్రంగా ఆయనను ఆహ్వానించడానికి అంగీకరించాడు అనేకవిషయాలు స్వేచ్ఛగా వారు మాట్లాడుకొన్నారు. ఆ సంభాషణలలో మాక్స్‌మూలర్ కూడా పాల్గొన్నాడు. క్రైస్తవేతరులకు ముక్తి లేదన్నట్లు పూసే మాట్లాడాడు. కేశవచంద్రసేన్, మాక్స్‌మూలర్ ఇద్దరూ క్రైస్తవేతరులకు కూడా ముక్తి కలదనీ, వారివారి మతాలు రక్షింపబడాలనీ వాదించారు. ఆ సంభాషణల అంతంలో కేశవ చంద్రసేనుడు ముక్తి అంటే భగవానునితో నిరంతరసమాగమంగా నిర్వచిస్తూ ఇలా అన్నాడు__"నా ఆలోచనలు భగవానునికి దూరంగా ఏనాడూ లేవు. నా జీవితం ఒక నిరంతర ప్రార్థనాగీతం. నేను భగవానుని ప్రార్థించని క్షణం అంటూలేదు." ఈ మాటలు ఎంతో గాఢవిశ్వాసంతో చెప్పాడు కేశవచంద్రసేన్. దానితో పూసే మహాశయుని హృదయం నిదానించింది. "అయితే, మీ భావనాధోరణి బాగానేవుంది." అని పూసే అన్నాడు. అలా వారిద్దరూ స్నేహితులుగానే ఒకరివద్ద మరొకరు సెలవు పుచ్చుకొని విడి

పోయారని మాక్స్‌మూలర్ ఆ సంఘటనలను స్మృతిలోనికి తెచ్చుకొం అంటాడు. కేశవచంద్రుడు ఆక్స్‌ఫర్డులో ఉన్నప్పుడు మాక్స్‌మూలర్ అతిథి. అప్పుడు మాక్స్‌మూలర్ ఆయనను సన్నిహితంగా నిశితంగా పరి శీలించేందుకు చక్కటి అవకాశం చిక్కింది. సర్వదా ప్రశాంతంగా ఉండే ఆయన మనస్తత్వం, స్వచ్ఛమైన స్థిరగంభీరమైన ఆయన అభిప్రాయాలు మాక్స్‌మూలర్ హృదయంపై గాఢ ముద్రవేశాయి.

ఇలా భారతీయఉద్యమాలతో, ఉద్యమ కర్తలతో మాక్స్‌మూలర్ సాన్నిహిత్యం అపరూపమైంది, 'వసుధైక కుటుంబకమ్' అనే గీతాదర్శం ఆయనపట్ల సార్థకమైంది. ఆయన జన్మతః జర్మన్ అయినా ఆయనకు దేశ దేశాలలో బంధువులున్నారు, భారతీయ బంధువులు ఆయనకు దగ్గర య్యారు. అంతే!...

* * * *

# అస్తమయం

మాక్స్‌మూలర్ 1899 సం॥లో జర్మనీ వెళ్ళినప్పుడే పెద్ద జబ్బుపడ్డాడు. తర్వాత జబ్బు నిదానించింది. బాగా కోలుకొని మళ్ళీ నిత్యవిధులన్నీ నిర్విఘ్నంగా కొనసాగించడం ప్రారంభించాడు. ఇంకా పదిరోజులలో ఆయనను మృత్యువు ఆహ్వానిస్తుందనేవరకు ఆయన తన సాహితీవ్యాసంగం సాగిస్తూనే ఉన్నాడు. చివరివరకు ఆయనకృషి నిర్విరామంగా సాగుతూనే ఉంది. "ఆఖరి వ్యాసాలు" అనే మాక్స్‌మూలర్ రచించిన వ్యాసాల సంపుటం మాక్స్‌మూలర్‌కుమారుడు డబ్లియూ. జి. మాక్స్‌మూలర్ 1901 సం॥లో ప్రచురించాడు. ఆ వ్యాస సంపుటపు తొలిపలుకులో మాక్స్‌మూలర్‌కుమారుడు తన తండ్రి రచించిన ఆఖరు వ్యాసం "మనుష్యుడు అమృతుడా?" [Is Man Immortal] అనేదని వ్రాశాడు. అది ఆ సంపుటంలో చేర్చిన వ్యాసాలలో ఒకటి. ఆ వ్యాసంలో— "What author has ever said the last word he wanted to say, and who has not had to close his eyes before he could write Finis to his work? There are many things which I

should like to say but I am getting tired and others will say them much better than I could, and will, no doubt, carry on the work where I had to leave it unfinished'' అని వ్రాశాడు. ఈ వాక్యంలో తాను చేయవలసిందీ చెప్పవలసిందీ చాలా ఉందనీ, తాను దస్సిపోయినట్లూ, తాను మిగిల్చిపోయిన పనులను సమర్ధవంతంగా నిర్వహించేవాళ్లు చేబట్టి పూర్తి చేస్తారనీ విశదీకరించాడు. ఇవి ఆఖరు ఘడియలలో చెప్పే మాటల్లాంటివి. 1900 సం॥ అక్టోబరు 28వ తేదీన మృత్యుపరిష్వంగానికి చేరుకొన్నాడు. ఆయన మృతదేహాన్ని అక్స్ఫర్డులోని 'Holy Cemetery' లో 1900 సం॥ నవంబరు 1వ తేదీన సమాధిచేశారు. మరణశయ్యమీద ఉండగా ఆయన తన కుమారుణ్ని పిలిచి తన 'ఆత్మకథ'లో కొన్ని మార్పులను, చేర్పులను చేశాడు. ఈ ఆత్మకథా రచన అక్స్ఫర్డుకు చేరుకొన్న ప్రారంభదినాల వరకు మాత్రమే సాగింది.

మాక్స్‌మూలర్ మరణానంతరం ఆయన పేరిట ఒక నిధిని పోగు చేసి అధ్యయన, పరిశోధనలకు ఆ నిధిని సద్వినియోగపరచాలని ఆయన మిత్రులందరూ భావించారు. మాక్స్‌మూలర్ స్మారకనిధికి ఏడవ కింగ్ ఎడ్వర్డ్, భారతదేశపు అనేకమంది సంస్థానాధీశులు విరివిగా విరాళాలను ఇచ్చారు. జర్మన్ చక్రవర్తి 600 పౌనుల పెద్ద మొత్తాన్ని ఈ నిధికి అందించాడు. అనుకొన్నదానికన్నా ఎక్కువ నిధి పోగైంది. అలా పోగైన మాక్స్‌మూలర్ స్మారకనిధిలోని కొంతభాగాన్ని ప్రాచీన భారత దేశానికి సంబంధించిన పురావస్తు పరిశోధనకూ, చారిత్రక పరిశోధనకూ, భాషా సారస్వత అధ్యయనపరిశోధనా వ్యాసంగాలకూ ఖర్చుపెట్టవల సిందిగా అక్స్ఫర్డు యూనివర్సిటీకి కేటాయించారు. ఈ ధనంతోనే ఆయన స్మృతిచిహ్నంగా "Society for Oriental Research'' అనే సంస్థను జపాను దేశంలోని టోక్యో నగరంలో నెలకొల్పడం జరిగింది. ఆయన స్వంతలైబ్రరి అంతా 1901 సం॥లో టోక్యో విశ్వవిద్యాలయం సేక రించింది.

మాక్స్‌మూలర్ భార్య మాక్స్‌మూలర్ చివరిక్షణాలలో కూడా భారతదేశం ఆయనకు ఎంత సన్నిహితమైందో వివరించింది. ఆమె

ఇంగ్లీషులో వ్రాసిన వాక్యాలివి — "Very day that he left his room for the last time, The British Committee disires, to record its concern on account of the illness of Prof. Max Muller, the revered friend of India, and while expressing its admiration and gratitude earnestly trusts that he will soon be restored to health."

మాక్స్‌మూలర్ మరణానంతరం భారతదేశంనుండి మలబారి మహాశయుడు శ్రీమతి మాక్స్‌మూలర్‌కు ఇలా తంతి పంపాడు— "భారతదేశం అంతా మీతోబాటు దుఃఖిస్తున్నది" [All India mourns with you."

మాక్స్‌మూలర్ కాలధర్మం చెందినప్పుడు అనేక పత్రికలు ఆయనకు శ్రద్ధాంజలి సమర్పిస్తూ, తమకు ఆయనపట్ల గల గౌరవభావాలను ప్రకటించుకొన్నాయి. ఆయనమృతికి సంతాపాన్ని తెలియపరుస్తూ బాలగంగాధర తిలక్ "ది మహ్రాటా" అనే పత్రికలో 1900 సం॥ నవంబరు 4 వతేదీన ఒక దీర్ఘవ్యాసం ప్రచురించాడు. 19వ శతాబ్దాంతంలో లోకమాన్య బాల గంగాధర తిలక్‌కు, మాక్స్‌మూలర్‌కు మధ్య సన్నిహిత సంబంధాలు నెలకొన్నాయి. స్నేహపూరితములైన ఉత్తరప్రత్యుత్తరాలు వారి మధ్య నడిచాయి. తన పత్రికలో— "ఆయన [మాక్స్‌మూలర్] దివంగతుడు కావడంవల్ల ఇండియా అతిసన్నిహితుడైన ఆప్తుణ్ణి, తాను ఎంత ఉత్సాహంగానో అభిమానించే మిత్రుణ్ణి కోల్పోయింది. శూన్యంచేసి వెళ్ళిపోయిన ఆయన స్థానాన్ని ఎవరు ఎప్పుడు భర్తీ చేయగలరో మనకు అర్థంకాని విషయం." అని తిలక్ వ్రాశాడు.

రమేశ్‌చంద్రదత్తు అనే భారతీయ నాయకుడు లండన్‌లోని గెథె సొసైటీలో మాక్స్‌మూలర్ మరణానికి సంతాపాన్ని వెల్లడిస్తూ ఉపన్యసించాడు. ఇంగ్లండులోని ఈ గెథే సొసైటీ సృష్టికి కారకుడు మాక్స్‌మూలరే. 1889 సం॥లో భారతజాతీయ కాంగ్రెసుకు అధ్యక్షుడూ, ఆనాటి భారతజాతీయోద్యమ ప్రముఖనాయకుడూ అయిన రమేశ్‌చంద్రదత్తు తన శ్రద్ధాంజలి ఉపన్యాసంలో భారతదేశపు సాంస్కృతికపునరుజ్జీవనం పై

ఐరోపాఖండంలో జరిగిన భారతీయ విషయపరిశోధన, ముఖ్యంగా మాక్స్ మూలర్ కృషి ప్రభావం బాగా ప్రసరించిందని, ఐరోపాఖండ విద్వాంసులు చేసిన ఆ కృషి పరోక్షంగా భారతదేశంలో జాతీయభావన వికసించడానికి సహకరించిందనీ వివరించాడు.

ప్రపంచంలోని అన్ని దేశాల సంస్కృత భాషావేత్తలు ఆయన మరణానికి ఖేదపడ్డారు. ప్రొఫెసర్ కీల్‌హర్న్ అనేకమందిలో ప్రాచీన భారతాన్ని గురించి తన వ్యాసాలద్వారా తన బహిరంగోపన్యాసాల ద్వారా అభిరుచిని మాక్స్‌మూలర్ కల్గించగలిగాడని ప్రశంసించాడు. "టైమ్స్" పత్రిక మాక్స్‌మూలర్ కలంనుండి వెలువడిన రచనలను, లేఖలను, ప్రకటనలను చాలా ప్రచురించింది. ఆయన మృతిచెందినప్పుడు 'టైమ్స్' పత్రిక 1900 అక్టోబరు 29వ తేదీన ఆయన స్మృతిచిహ్నంగా ఒక వ్యాసం ప్రచురించింది. ఆ వ్యాసంలో ఇంగ్లండులో ఉండి ఆయన చేసిన మహత్తర సేవలను ఎంతో కొనియాడింది. 'ప్రాగ్దేశ పవిత్ర గ్రంథ పరంపర'ను ప్రచురింపజేయడంవల్ల ఆయన ప్రాక్పాశ్చాత్య దేశాల రెంటికీ అపూర్వ సేవచేశాడని ఆ పత్రిక కీర్తించింది. అదేకాక ఆయన మృతివల్ల ఆక్స్ఫర్డు ఒక ముఖ్యమైన ఆభరణాన్నే పోగొట్టుకొన్నదనికూడా 'టైమ్స్' వ్రాసింది. బెర్లిన్ పత్రికలుకూడా ఆయన జర్మనీకి, ఇంగ్లండుకు చేసిన సేవలను గుర్తించింది. "The National Zeitung" అనే జర్మన్ పత్రిక మాక్స్‌మూలర్‌ను తమ జర్మన్‌వాడిగా భావించుకొని గౌరవించినా మరణానికి ముందు ఒక సంవత్సరంపాటు ఆయన రాజకీయాభిప్రాయాలు తన మాతృదేశానికి విరుద్ధంగా ఉన్నాయని వ్యాఖ్యానించింది. అమెరికా దేశవాసి ఎ.వి. విలియమ్స్ జాక్సన్ "మాక్స్‌మూలర్—ఆయన కృషి" అనే వ్యాసాన్ని "The Forum" అనే పత్రికలో ప్రచురించాడు. అందులో భాషా విషయక, ప్రాగ్దేశ విషయిక పరిశోధనలవల్ల మాక్స్‌మూలర్ పేరు చిరస్థాయిగా నిలిచి ఉంటుందని ఆ వ్యాసరచయిత అంటాడు.

ఐరోపా ఖండంలో కొంతకాలం మాక్స్‌మూలర్ కీర్తి అలాగే బాగా వ్యాపించి ఉంది. 20 వ శతాబ్దంలో మొదటి ప్రపంచ యుద్ధానికి

ముందు రోజులలో ఐరోపాలో ఆయన పేరుప్రతిష్ఠలు మసకబడ జొచ్చాయి. ప్రాయశంగా ఆయన పేరు కొద్దిమంది సంస్కృత పండితుల, భాషావేత్తల పరిచయ పరిధిలో మాత్రమే ఉంటూవచ్చింది. 1900 సం॥ లో ఆయన మరణించాడు కదా. అప్పుడే ఇరవయ్యోశతాబ్దం ఆరంభ మైంది. అప్పట్లో కొందరు జర్మను జాతీయవాదులలో ఇంగ్లీషు వారంటే వ్యతిరేకభావం రేగింది. ముఖ్యంగా పత్రికాప్రపంచంలో ఇది ఇనుమ డించింది. జర్మన్ జాతీయవాదుల ఇలాంటి ద్వేషప్రచారంతో నెమ్మది నెమ్మదిగా ఇంగ్లండులో జర్మనులపై నమ్మకం సడలిపోవడం ప్రారంభ మైంది. అలా ఇంగ్లండు జర్మనీ సంబంధాలు రాజకీయంగా చెడిపోవడం జరిగింది. 1914 సం॥ ముందు ఐరోపాలోని వివిధ దేశాలలో వింతజాతీయ వాదం రేకెత్తింది. విశాలమానవతావాదం లోపించింది. మాక్స్‌ముల్లర్ అభిలషించిన అంతర్జాతీయసుహృద్భావవాతావరణం అదృశ్యమైంది. ముఖ్యంగా 1914 సం॥ లో ఐరోపాలో వచ్చిన సంక్షోభంతో మాక్స్ ముల్లర్ భావించిన విశాల రాజకీయాశయాలు పూడ్చిపెట్టబడ్డాయి. పాండిత్య విషయంలో కూడా ఆయనభావాలు పాతబడిపోయాయి. ఆయన జీవితకాలంలోనే 'Archeology, Anthropology' అనే నూతన శాస్త్రాలు వికసిస్తూ ప్రాచీన యుగాలను గురించిన అన్వేషణ ప్రారంభిం చాయి. ఆయనతర్వాతకూడా మరికొన్ని పరిశోధనలు ఆయారంగాలలో జరి గాయి. దానితో ఆయన ప్రాచీనమైన భాషలను, మతాలను, పురాణాలను గురించి చేసిన పరిశోధనలు చాలావరకు శాస్త్రీయత కోల్పోయినాయి. 19వ శతాబ్దంలో ప్రవర్తిల్లిన డార్విన్ పరిణామవాదమూ 20వ శతాబ్దంలో ఐరోపాలో ద్విగుణీకృతోత్సాహంతో ఎక్కువగా రాజకీయ ప్రపం చంలో కూడా శిరసావహింపబడింది. దానివల్ల కూడా మాక్స్‌ముల్లర్ మతవిశ్వాసాలు భావప్రధానపరిణామవాదంపట్ల ఆయనకున్న నమ్మ కాలూ అంటే అక్కడ సామాన్య ప్రజానీకానికీ ఆసక్తి తగ్గింది.

# ఆఖరుమాటలు

ఐరోపాలో అలా మాక్స్‌ముల్లర్ స్మృతి అక్కడ ప్రజలలో కొంతమంది ఐరోపా పండితులు చెబుతున్నట్లు సన్నగిల్లుతూ ఉన్నప్పటికీ, ఇండియాలో మాత్రం తన సాంస్కృతిక పునరుజ్జీవన యుగనిర్మాణంలో ఆయన సహృదయతతో చేసిన ఎనలేని సేవను భారతదేశం ఈ నాటి వరకూ మరవలేదు 1957 సం॥ లో భారత ప్రజలకు మాక్స్‌ముల్లర్ యెడలగల ప్రేమగౌరవాల ఆధారంగా న్యూఢిల్లీలోని జర్మన్ గెధె ఇన్ స్టిట్యూటు శాఖకు "మాక్స్ ముల్లర్ భవన్" అని నామకరణం చేశారు. భారతదేశంలో విభిన్న నగరాలలో గల ఈ సంస్థ శాఖలు కూడా మాక్స్ ముల్లర్ భవనాలనే పేరుతోనే పిలవబడుతూ ఉన్నాయి. ఈ మాక్స్‌ముల్లర్ భవనాలు ఇండో_జర్మన్ సాంస్కృతిక సంబంధాలను పటిష్టం చేయ డానికి సహకరిస్తున్నాయి.మాక్స్‌ముల్లర్ ఆశయమైన భారతీయ సంస్కృతిని పాశ్చాత్యులు, పాశ్చాత్య సంస్కృతిని భారతీయులు పరస్పరం విని మయం చేసుకొనేందుకు ఈ సంస్థలు చురుకుగా పనిచేస్తున్నాయి. జర్మన్ భాష నేర్పేందుకు తరగతులు నిర్వహించడం, ఉపన్యాసాలు ఏర్పాటుచేయ డమే కాకుండా అప్పుడప్పుడూ భారతీయ సంగీతం, నృత్యం మొదలగు కళలు, ఇతర విజ్ఞాన విషయాలు పాశ్చాత్యులకు తెలియజెప్పే కార్య క్రమాలు ఏర్పాటు చేయడం జరుగుతున్నది. జర్మనుభాషను భారతీయు లకు చెప్పడంవల్ల రెండు దేశాల సభ్యతల సామరస్యానికిది సహకరిస్తుంది. ఈ సందర్భంలో భాషాపరిశోధన గురించి, భాషలను నేర్చుకొనడంగురించి మాక్స్‌ముల్లర్ అన్నమాటలు స్మరించడం మంచిది. మాక్స్‌ముల్లర్ ఇలా అన్నాడు__"నూతన దిగంతాలు సుదూరంగా విశాలంగా కన్పిస్తు న్నాయి. మనకాళ్ళక్రింద భూమి విశాలమౌతున్నది. అలాగే మన హృద యాలూ విశాలంగా వికసిస్తున్నాయి. దూరసీమలను కౌగిలిలోనికి చేర్చు కొనడం నేర్చుకొన్నాం. అలా ఎదురుకుండా ఉన్నదంతా వింతసౌంద ర్యంతో కన్పిస్తున్నది. విశాల భావనలను రూపొందించుకొంటున్నాం. ఉన్నతమైన సత్యాలను దర్శించగలుగుతున్నాం."

మాక్స్‌మూలర్ విశ్వమతసమన్వయాన్ని, జాతుల సౌభ్రాతృత్వాన్ని ఆశించాడు. మానవాళికి మంచికూర్చాలని తపనపడ్డ మహాత్ములందరి మాదిరిగానే తాను కూడా మనుష్యుల వికాసాన్ని గురించి, వారి మధ్య సామరస్యాన్ని గురించీ కలలు కన్నాడు. 1832 సం॥ లో ఫ్రెంచి విదేశాంగమంత్రికి మాక్స్‌మూలర్ ఒక లేఖ వ్రాస్తూ దేశదేశాలమధ్య స్వేచ్ఛా ప్రయాణాలు సాగాలని వ్రాశాడు. ఆ లేఖలో మానవులంతా ఒకే కుటుంబానికి చెందిన వారనీ, అసంఖ్యాకమైన జాతులు, కులాలు ఆ కుటుంబంలో భిన్నభిన్న శాఖలు మాత్రమేనని మాక్స్‌మూలర్ వివరించాడు.

సమన్వయప్రవక్త శ్రీ రామకృష్ణపరమహంస ప్రభావంవల్ల మాక్స్‌మూలర్ హృదయమూ సమన్వయభావనలతో నింపివేయబడింది. మాక్స్‌మూలర్ తాను శ్రీరామకృష్ణులను గురించి వ్రాసిన గ్రంథపు పీఠికలో ఇలా వ్రాశాడు— "శ్రీ రామకృష్ణుల సందేశాలు కోటానుకోట్ల మనుష్యుల విశ్వాసాల్ని, ఆశయాల్ని తెలియపరుస్తాయి. కాన నిజంగా ఆ దేశ భవిష్యత్తు విషయంలో మంచిని ఆశించవచ్చు. జీవునిలోనే దేవుడున్నాడనే భావన వారి అందరిలో ఉంది. విగ్రహాలు పూజిస్తున్నట్లు కన్పించే వారిలో కూడా ఈ భావన నెలకొని ఉంది. ఇటువంటి నిత్య ఈశ్వరసాక్షాత్కారాన్ని సర్వత్రా కల్గించుకొనే సమానభూమికపైనే భవిష్యన్మందిరం నిర్మింపబడుతుంది. ఆ ఆలయంలో హిందువులు, హిందువులుకానివారు అందరూ చేతులు చేతులు కలిపి, హృదయాలుహృదయాలు మేళవించి మనం ఎవరి అస్తిత్వంలో ఉండి జీవించి చరిస్తున్నామో, మనకు ఏమాత్రం దూరంలోలేని మన సన్నిహితాత్మయగు అట్టి పరమాత్మను ఆరాధించడం సంభవిస్తుంది." ఇటువంటి సమన్వయ భావనలే ప్రాగ్దేశ పవిత్ర గ్రంథాల అనువాదాల ప్రచురణకు ఆయనలో ప్రబోధం కల్గించాయి. ఎంతమంది పండితులో ఈ మహాక్రతువు విజయవంతంగా జరగడానికి సహకరించారు. అదివరకెన్నడూ అనువదింపబడని గ్రంథాలనుకూడా అనువదించి సేవ చేశారు. ఈ గ్రంథాలు ప్రచురించడమూ ఆయనకు కష్టసాధ్యమైంది. ఎలాగో అలాగు లార్డ్ శాల్స్‌బరీ, డా॥ లిడ్డెల్‌ల ప్రభావంవల్ల ఆక్స్‌ఫర్డ్ యూనివర్శిటీ ప్రెస్ దీని ప్రచురణ భారాన్ని వహించింది. పూర్తిగా ఏభై సంపు

టాలు తయారైన తర్వాత ఇవి యూరప్‌లో, అమెరికాలో, భారత దేశంలోగల అన్ని ప్రధాన గ్రంథాలయాలలోని అల్మారా అరలను అలంక రించాయి. ఋగ్వేద సంపుటాల ప్రచురణప్పుడుకూడా ఆయనకు ఎంత మంది మిత్రులో ముందుకువచ్చి సహకరించారు. ఆ సహకారఫలితంగానే ఈస్టిండియా కంపెనీ డైరక్టర్లు ఈవిధంగా నిర్ణయించారు. వారి మాటలు ఇక్కడ ఉదహరించడమే బాగుంటుంది. ఈస్టిండియా కంపెనీ పాలక వర్గం— "కోర్టు (ఈస్టిండియా కంపెనీ పాలకవర్గం) ఈ ప్రచురణ చాలా ముఖ్యమనీ, ఆసక్తిజనకమైందనీ సూచించిన మీ ప్రతిపాదనలు మన్నించింది. తమచే పరిపాలింపబడుతున్న అశేష భారత దేశ ప్రజల ప్రాచీన మతం, చరిత్ర, భాష - వీటికి సంబంధించిన సమాచారమునందిస్తుంది కాబట్టి ప్రత్యేకంగా ఈస్టిండియాకంపెనీ సహాయానికి ఇది పాత్రమైంది." అని అంది. ముఖ్యంగా ఋగ్వేదసంపుటాలవల్ల ప్రాగ్దేశ పవిత్ర గ్రంథాల ప్రచురణవల్ల ఆయన పేరు చిరస్థాయిగా నిలిచి ఉంటుంది. ముఖ్యంగా పండిత లోకం ఏనాడూ మరిచిపోలేని పనులు ఇవి.

భారతదేశంలో మాక్స్‌మూలర్ భవనాలు వెలిశాయి. సరే. అసలు భారతదేశం ఏనాడూ మరచిపోలేని పనులుకూడా ఆయన ఎన్నో నిర్వ హించాడు. బ్రిటీషుపాలనలో ఉన్న భారతదేశాన్ని ప్రగతిపథం వైపునకు ఉన్ముఖంచేసిన నాయకవైతాళికులలో ఆయనా ఒక వైతాళికుడయ్యాడు. భారతదేశానికి వేలమైళ్ళ దూరంలో ఆక్స్‌ఫర్డులో ఉంటూనే భారతదేశానికి మానసికంగా సన్నిహితుడయ్యాడు. ముఖ్యంగా భారతదేశంవచ్చే బ్రిటీష్ పాలకుల మనస్తత్వంలో మార్పు రావాలనే ఆయన ఆశయం, కొంత కాక పోతే కొంతన్నా సిద్ధింప జేసుకోగలిగాడు. మాక్స్‌మూలర్ క్రేంబిడ్జి విశ్వ విద్యాలయంలో ఇచ్చిన "హిందూదేశం: అది మనకు నేర్పేది ఏమిటి?" అనే-ఉపన్యాసాలు ఈ ప్రయోజనసిద్ధికే ఉద్దేశింపబడ్డాయి. ఆ ఉపన్యాసా

లలో ఉద్యోగరీత్యా భారతదేశం వెళ్ళేవారికి ఏరంగంలో కృషి చేయాలను కొంటే ఆయారంగాలలో అన్నిటికి అవకాశాలున్నాయని అంటాడు. భారత దేశం గురించి మిల్ రచించిన "బ్రిటీష్ ఇండియా చరిత్ర" వంటి గ్రంథాలు బ్రిటీష్ పాఠకులలో అపార్థాలు కల్పిస్తున్నవని తీవ్రంగా విమ ర్శించాడు. అవి చదవవద్దనీ, ష్లిమన్ స్మృతులు వంటి ఉత్తమ గ్రంథాలు భారతదేశాన్ని గురించి సదభిప్రాయాలు కల్గిస్తాయని కేంబ్రిడ్జ్ విద్యార్థులకు ఆయన విశదీకరించాడు. కమాలుద్దీన్-ఎర్రజాక్ సమర్కండి (1413-1482) వ్రాతలు, 16వ శతాబ్దపు అబుల్‌ఫజల్‌రచనలు హిందువుల ఉదారశీలాన్ని తెలియపరుస్తాయి. ఒక్కసారి పరిశీలించండని ప్రబోధం చేశాడు. కేంబ్రిడ్జిలో ఇచ్చిన మూడో ఉపన్యాసంలో సంస్కృతభాషను గురించి ఆంగ్లేయులలోనూ, ముఖ్యంగా ఇండియాకు వెళ్ళబోయే 'సివిల్ ఉద్యోగులలోనూ ఉన్న దురభిప్రాయాలను దూరంచేయడానికి యత్నిం చాడు. సంస్కృతం మృతభాష అని అనాలోచితంగా ఆధారరహితంగా చేసే వాదాలను ఆయన వ్యతిరేకించాడు. సంస్కృత భాష ప్రజల వాడుక భాషగా లేకపోయినా, సాంస్కృతిక జీవితంలో మతవిశ్వాసాలలో ఆభాష కున్న ప్రాధాన్యం మహత్తరమైందని ఆయన వారికి తెలియజెప్పాడు. ఆయన ఇలా అన్నాడు— "ఈ క్షణానికీ- ఇంగ్లీషు పాలనవచ్చి ఒక శతాబ్దం అయిన తర్వాత కూడా, డాంటే కాలంనాడు యూరపులో లాటిన్ భాష అర్థం చేసుకొన్న దానికన్నా సంస్కృతం భారతదేశంలో బహు ళంగా అర్థం చేసుకోబడుతున్నదని నేను విశ్వసిస్తున్నాను". ఆ కాలంలో భారతదేశంలో నడుపబడుతున్న "విద్యోదయ" "ప్రత్న కమ్ర నందినీ" మొదలగు సంస్కృతపత్రికలను గురించికూడా క్షుణ్ణంగా ఆయనకు తెలుసు. ఇవికూడా ఉదహరించి, అప్పటి భారతదేశంలో సంస్కృత ప్రాచుర్యాన్ని గురించి వివరించాడు. అనాటి భారత ప్రజల భాష

దేశంలోని సర్వ సంస్కృత గ్రంథాల పట్టిక తయారు చేయాలని అభిలషించి ఆ పనికి పండితులను పురమాయించింది. సంస్కృతంలోగల 10,000 వ్రాత ప్రతుల పట్టిక తయారుచేశారు వారు ఈసంఖ్య గ్రీకు, ఇటాలియన్ సారస్వత గ్రంథాల మొత్తం సంఖ్యకన్నా మించిందని తాను విశ్వసిస్తున్నట్లు మాక్స్‌మూలర్ నొక్కిచెప్పి, సంస్కృత భాషాధ్యయన ప్రాధాన్యాన్ని విశదపరిచాడు.

అన్నిటా సమన్వయాన్ని ఆశించిన సహృదయమూర్తిగా, భారతీయ మిత్రునిగా, ప్రపంచపౌరునిగా ఈ మానవలోకం ఆయనను సదా జ్ఞాపకం చేసుకోవలసి ఉంటుంది. ఆయన విశాలఆశయాలు ఆచరణద్వారా నిరూపించి ఆయనకు ఋణం తీర్చుకోవలసి ఉంటుంది.

ఓం తత్సత్

# అనుబంధం - 1.

## మాక్స్ మూలర్ ముఖ్య రచనలు

1. హితోపదేశము, జర్మన్ అనువాదం, లిప్జిగ్ 1844.
2. మేఘదూతము, జర్మన్ అనువాదం, కోయినిగ్స్‌బర్గ్ 1847.
3. ఋగ్వేదసంహిత, ఋగ్వేద ఋక్కుల అనువాదం: వివరణ, లండన్ 1869.
4. వేదఋక్కులు, [Vedic Hymns]అనే పేరిట మరింత విపులంగా ప్రాగ్దేశ పవిత్ర గ్రంథపరంపరలో ప్రచురింపబడింది. [The sacred Books of the East], 32వ సంపుటం 1891.
5. ఋగ్వేద సంహిత, సాయణభాష్య సహితంగా, 6 సంపుటాలు, లండన్ 1849_73.
6. ఋగ్వేద ప్రాతిశాఖ్య, మూలం జర్మన్ భాషానువాదంతో, లిప్జిగ్ 1856__69.
7. ప్రాచీన సంస్కృత సాహిత్య చరిత్ర [History of Ancient Sanskrit Literature], లండన్ 1859.
8. సంస్కృత వ్యాకరణం [A Sanskrit Grammer],లండన్ 1866.
9. "భారతదేశం: అది మనకు నేర్పేది ఏమిటి ? [India: what it can teach us ?] లండన్ 1883.

10. దమ్మపదము, పాళినుండి అనువాదం,
లండన్ ప్రథమ ముద్రణ 1870.
ఇది "ప్రాగ్దేశ పవిత్రగ్రంథపరంపర"లో 10 వ సంపుటం,
రెండవ ముద్రణ 1898.

11. "మిషన్స్ గురించి" [On Missions] వెస్ట్ మినిస్టర్ ఎబ్బేలో చదివిన ఉపన్యాసం, లండన్ 1873.

12. మతశాస్త్ర పరిచయం [Introduction to the science of Religion], లండన్ 1873.

13. మతోత్పత్తి వికసనములు [The origin and Growth of Religion]. ఇందులో భారతదేశమతవికాసమే ప్రత్యేకంగా చర్చింపబడింది, లండన్ 1878.

14. ప్రకృతి సంబంధ మతము [Natural Religion], లండన్ 1889

15. భౌతిక సంబంధ మతము [Physical Religion], లండన్ 1891.

16. మానవశాస్త్రసంబంధమతము [Anthropological Religion], లండన్ 1892.

17. దివ్యజ్ఞానము లేదా మనస్తత్వ సంబంధ మతము [Theosophy, or Psychological Religion], లండన్ 1893.

18. పురాణాల శాస్త్రీయ సమాలోచనలు [Contributions to the Science of Mythology], 2 సంపుటాలు, లండన్ 1897.

19. భాషా విషయిక అంతస్తుల వివరణ [On the Stratification of language], రెడె ఉపన్యాసం; లండన్ 1868.

20. భాషాశాస్త్రము [The Science of Language], 2 సంపుటాలు, లండన్, 1861, (మొదటి సంపుటం) 1863 (రెండో సంపుటం).

21. స్ట్రాస్‌బర్గ్ యూనివర్శిటీలో భాషాశాస్త్రాన్ని గురించిన ఉపన్యాసాలు, జర్మన్ భాషలో; స్ట్రాస్‌బర్గ్ 1872.

22. పదాల జీవిత చరిత్రలు: ఆర్యుల నివాసభూమి [Biographies of words and the Home of the Aryans], లండన్ 1888.

23. ఆలోచనా శాస్త్రము [The Science of Thought],లండన్ 1887

24. వేదాంతదర్శనాన్ని గురించిన ఉపన్యాసత్రయం. [Three Lectures on the Vedanta Philosophy], లండన్ 1894.

25. రామకృష్ణ పరమహంస జీవితం: బోధనలు [Ramakrishna, his life & sayings], లండన్ 1898.

26. ఔల్డ్ లాంగ్ జైనె [Auld Lang Syne], 2 సంపుటాలు, లండన్ 1898 (మొదటి సంపుటం) 1899 (రెండవ సంపుటం); ఇందులో రెండవ సంపుటం "నా భారతీయ మిత్రులు" [My Indian Friends] అనేది.

27. 4వ శతాబ్దంనుండి 19వ శతాబ్దంవరకు జర్మనీభాషా మహారచనలు, లండన్ 1858.

28. జర్మనీ ప్రేమ [Deutsche Liebe], లిప్జిగ్ 1857 (ప్రథమ ముద్రణ) ఈ గ్రంథంలో మాక్స్‌మూలర్ కవితాహృదయం మనోహరంగా ప్రతిబింబించింది. మూలం జర్మనీ భాషలో ఉంది. 13 సార్లు ముద్రణలోకి వచ్చింది. ఇది ఫ్రెంచి, ఇటాలియన్, రష్యన్, ఇంగ్లీషు భాషలలోనికి అనువదింపబడింది. ఇందొక ప్రేమగాథ చిత్రితమైంది, ఒక యువ విద్యార్థి వికలాంగయైన రాకుమారిని వలచిన ఉదంతం ఇందులో నడుస్తుంది. 13వ ముద్రణ 1898 సం॥లో వెలువడింది.

29. విల్‌హెల్మ్‌మూలర్ గీతాలు [Wilhelm Muller Gedichte], ఇది మాక్స్‌మూలర్ ఉపోద్ఘాతంలో ప్రచురింపబడింది. లిప్జిగ్ 1868.

30. షిల్లర్‌ను గురించిన ఒక గ్రంథం [Schillers Brief wechsel

mit dem Herzog Friedrich Christian Von Schleswig-Holstein-Augustenburg], దీనికి సంపాదకుడు మాక్స్‌మూలర్, లిప్జిగ్ 1875.

31. షేరర్ రచించిన జర్మన్ సారస్వత చరిత్ర: శ్రీమతి కోనిబియర్ అనువాదంతో, మాక్స్‌మూలర్ సంపాదకత్వ పర్యవేక్షణలో ప్రచురితమైంది; ఆక్స్‌ఫర్డు 1885.

32. జర్మన్ కర్మాగారంనుండి వెలువడిన మచ్చుతునకలు [Chips from German WorkShop] 4 సంపుటాలు, లండన్_1867 నుండి 1875 వరకు ఇవి ప్రచురితమైనాయి.

33. జర్మనీ ఫ్రాన్సు యుద్ధాన్ని గురించి మాక్స్‌మూలర్ 'టైమ్స్' సంపాదకునికి వ్రాసిన లేఖలు, 1871.

34. ష్లేస్విగ్—హోల్‌ష్టయిన్ సమస్య : చరిత్రలో దాని స్థానం ("The Schleswig-Holstein question and its place in History") "19 వ శతాబ్దం" అనే పత్రికలో ("The Ninteenth century") మే 1897 లో ప్రచురింపబడింది.

35. "జర్మనుల ఆంగ్లేయ వ్యతిరేక భావన: దీని హేతువులు" [Anti-English feeling among the Germans & its causes"] "ది ఫోరమ్" అనే న్యూయార్కు పత్రికలో 1900 సం॥ సెప్టెంబరులో ప్రచురితమైంది.

36. జర్మన్ శాంతి మహోత్సవ సందర్భాన లండనులో ఇచ్చిన ఉపన్యాసం. మే 1 వ తేదీ 1871, లండన్ [ 1871 ? ]

37. ఒక జర్మన్ జర్మనీకి చేసిన వాదం [A German plea for Germany]_ 'టైమ్సు' పత్రికలో 29 ఫిబ్రవరి 1864 సం॥లో ప్రచురితమైంది.

38. "గెథె_కార్లయల్" [Goethe and Carlyle] 'ఇంగ్లిషు గెథె సొసైటీ'కి ప్రథమాధ్యక్షుడుగా ఇచ్చిన ప్రారంభోపన్యాసం, 'సమకాలీన

సమీక్ష' అనే పత్రికలో [The Contemporary Review], జూన్ 1886 ప్రచురితమైంది.

39. బౌద్ధ శూన్య వాదాన్ని గురించి— Ueber den Buddhistischen Nihilismus, జర్మన్ భాషాతత్త్వజ్ఞుల సమావేశంలో చదివిన కీల్‌లో ఉపన్యాసం, కీల్ 1869.

40. ఎనెక్డొటా ఆక్సోనీన్సియా : ఆర్యగ్రంథ పరంపర [Anecdota Oxoniensia].

ఈ పరంపరలో ప్రచురింపబడిన గ్రంథాలకూ మాక్స్‌మూలరే సంపాదకత్వ బాధ్యత వహించాడు. ఇందులో జపానుకు సంబంధించిన బౌద్ధ గ్రంథాలు, ధర్మ సంగ్రహమనే ఒక బౌద్ధ పారిభాషిక పదాల గ్రంథం మొదలైనవి వెలువడ్డాయి.

41. ప్రాగ్దేశ పవిత్ర గ్రంథ పరంపర[The Sacred Books of the East], 50 సంపుటాలు ఆక్స్‌ఫర్డు, 1879—1910.

ఈ ప్రాగ్దేశ పవిత్ర గ్రంథాలపరంపరలో 50సంపుటాలు వెలువడ్డాయి. ఇవన్నీ మాక్స్‌మూలర్ సంపాదకత్వం క్రింద ప్రచురింపబడ్డాయి.

1, 15 సంపుటాలు, ఉపనిషత్తులు, 2 సంపుటాలుగా వెలువడిన ఈ ఉపనిషత్తులను మాక్స్‌మూలర్ స్వయంగా అనువదించాడు.

2, 14, ఆర్యుల ధర్మశాస్త్ర గ్రంధాలు, ఈ 2 సంపుటాలు జార్జి బూలర్ అనువాదం.

3, 16, 27, 28, 39, 40 చీనా పవిత్ర గ్రంథాలు, ఈ 6 సంపుటాలు జేమ్స్ లెగ్గె అనువదించాడు.

4, 23, 31 జెండ్-అవెస్తా, ఈ 3 సంపుటాలు జేమ్స్‌డార్మెస్టేటెర్, ఎల్.హెచ్. మిల్స్ అనువదించారు.

5, 18, 24, 37, 47 పహ్లావీ గ్రంథాలు, ఈ 5 సంపుటాలు ఇ.డబ్లియూ. వెస్ట్ అనువాదం చేశాడు.

8, 9, ఖురాన్, ఈ రెండు సంపుటాలు ఇ. హెచ్. పామ్మెర్ అనువదించారు.

7, వైష్ణవ ధర్మశాస్త్రం, ఇది జూలియస్ జోలీ అనువాదం.

10, ధమ్మపదము, మాక్స్‌మూలర్ అనువాదం.

11, బౌద్ధసూత్రాలు, టి. హెచ్. రైస్‌డేవిస్ అనువాదం.

12, 26, 41, 43, 44 శతపథ బ్రాహ్మణం, ఇవి 5 సంపుటాలు, జూలియస్ ఎగ్లింగ్ అనువాదం.

13, 17, 20 వినయపిటకసంబంధ గ్రంథాలు, ఈ 3 సంపుటాలు టి.డబ్ల్యూ. రైస్‌డేవిస్, హెర్మన్ ఓల్డెన్‌బర్గ్‌లు అనువదించారు.

19, The Fo-Sho-Hing-Tsan-King: శామ్యూల్‌బీల్ అనువాదం.

21, సద్ధర్మపుండరీకము, హెచ్. కెర్న్ అనువాదం.

22, 45, జైనసూత్రాలు, ఈ 2 సంపుటాలు హెర్మన్ జాకోబీ అనువాదం,

25, మనుధర్మశాస్త్రం, జార్జి బూలర్ అనువాదం.

29, 30, గృహ్యాసూత్రాలు, ఈ రెండు సంపుటాలు హెర్మన్ ఓల్డెన్‌బర్గ్ మాక్స్‌మూలర్‌లు చేసిన అనువాదాలు.

32,46 వేద ఋక్కులు, ఈ 2 సంపుటాలు మాక్స్‌మూలర్ హెచ్. ఓల్డెన్‌బర్గ్ కలిసి అనువదించినవే.

33, గౌణ ధర్మశాస్త్ర గ్రంథాలు, జూలియస్ జోలీ అనువాదం.

34, 38 వేదాంత సూత్రాలు, ఈ 2 సంపుటాలు, శంకరభాష్య సహితంగా జి. థీబో అనువాదం.

35, 36 మిళిందపన్హా, ఈ రెండు సంపుటాలు, టి.డబ్ల్యూ. రైస్‌డేవిస్ అనువాదం.

42, అధర్వణ వేదమంత్రాలు, ఎం. బ్లూమ్‌ఫీల్డ్ అనువాదం.

48, వేదాంతసూత్రాలు, రామానుజభాష్య సహితంగా, జి. థీబో అనువాదం.

49, మహాయానబౌద్ధగ్రంథాలు, ఇ. బి. కోవెల్, మాక్స్‌మూలర్, జె. టాకాకుసుల అనువాదం.

50 విషయసూచిక సంపుటం, ఇది ఎం. వింటర్‌నిట్జ్ తయారుచేసినది.

# అనుబంధం - 2.

## మాక్స్‌మూలర్ జీవిత ముఖ్యఘట్టాలు

| | | |
|---|---|---|
| జననం | 6 డిశంబరు | 1823 |
| పితృవియోగం | ... | 1827 |
| డెసావూలో చదువు | ... | 1836 వరకు |
| లిప్జిగ్‌లోని విశ్వవిద్యాలయ ప్రవేశం | ... | 1841 |
| డాక్టరేట్ పట్టం | ... | 1843 |
| బెర్లిన్ ప్రయాణం | ... | 1844 |
| పారిస్ ప్రయాణం | ... | 1845 |
| ఇంగ్లండు ప్రయాణం | ... | 1846 |
| ఆక్స్‌ఫర్డు ప్రథమ సందర్శనం | ... | 1847 |
| తిరిగి పారిస్ రాక | ... | 1848 ప్రారంభం |
| ఆక్స్‌ఫర్డుకు మకాం మార్పు | ... | 1848 మే_నెల |
| ఆక్స్‌ఫర్డ్ డిప్యూటీ టేలొరియన్ ప్రొఫెసర్‌గా నియామకం | ... | 1850 |

| | |
|---|---|
| టేలొరియన్ ప్రొఫెసర్‌గా నియామకం ... | 1854 |
| వివాహం ... | 1859 |
| బోడెన్ సంస్కృతాచార్య పదవికై జరిగిన పోటీలో ఓటమి ... | 1860 |
| బొడిలియన్‌లో ఉపలైబ్రరియన్ కావడం ... | 1865 |
| ఆక్స్‌ఫర్డులో తులనాత్మక భాషాశాస్త్రశాఖ ఆచార్య పీఠాధిరోహణ ... | 1868 |
| స్ట్రాస్‌బర్గ్ యూనివర్శిటీ ఆహ్వానంపై జర్మనీ సందర్శనం | 1872 |
| రాయల్ ఇన్‌స్టిట్యూషన్ ప్రసంగాలు ... | 1870 |
| వెస్ట్ మినిస్టర్ ఎబ్బేలో ప్రసంగం ... | 1873 |
| గిఫర్డ్ ప్రసంగాలు ... | 1888 నుండి 1892 వరకు |
| ఋగ్వేద సంపుటాల ప్రచురణ | 1849 నుండి 1873 వరకు |
| భాషాశాస్త్ర ఆచార్యపీఠ బాధ్యతలనుండి విరమణ | 1875 |
| కేంబ్రిడ్జి విశ్వవిద్యాలయోపన్యాసం ... | 1883 |
| మరణం ... | 28 అక్టోబరు 1900 |

* * * *

# అనుబంధం-3

1. మాక్స్‌మూలర్ బ్రిటీషు ప్రధానమంత్రి గ్లాడ్‌స్టన్‌కు 13 జులై 1880 సం॥ లో వ్రాసిన లేఖాంశాలు :

"ఆంగ్ల జాతీయ గీతం" "God save the Queen" సంస్కృతానువాదం కలిగి ఉన్న ఒక చిన్న వ్యాసాన్ని దీనితోబాటు జతచేర్చి పంపుతున్నాను. భారతదేశంలో ఇంకా అచ్చటచ్చటా కన్పించే ప్రసిద్ధ సంస్కృత భాషా పండితులకు నా యీ రచనను ముందుగా చూపవలెననెడి కోరిక ఉండటంవల్ల దీన్ని ఇప్పటికీ భారతదేశంలో నేను ప్రచురించలేదు. వారి అమోదముద్రపడిన తర్వాత నేను దానిని అచ్చొత్తించి భారతదేశానికి పంపుతాను. దాన్ని అచ్చటివారు స్వీకీయం చేసుకొంటారని నా విశ్వాసం. భారతీయ విద్యావంతులలో నాకుచాలామంది మిత్రులున్నారు. ఇతరులతో మాట్లాడిన దానికన్నా, వారికి వ్రాసే దానికన్నా వారందరూ నాతో ఎక్కువ చనువుతో మాట్లాడతారు; స్వేచ్ఛగా హృదయం విప్పి నాకు వ్రాస్తారు. రిప్పన్‌ప్రభువు నిర్వహించే వివేచనాయుత పరిపాలనా విధానాన్ని భారతప్రజలు అభినందిస్తున్నరీతి భారతదేశ భవిష్యత్తులో నాకు అత్యంతవిశ్వాసాన్ని కలిగిస్తోంది. ఇల్‌బర్ట్ బిల్లు అని చెప్పబడే దాన్ని గురించిగాని, అంతకుముందు సంవత్సరాలలో జరిగిన వ్యవహారాలను గురించి గాని నేను అంతగా ఆలోచించడంలేదు. అయితే, అప్పట్లో లిట్టన్ ప్రభువు సాగించిన నిరంకుశపరిపాలన దృష్టిలో ఉంచుకొన్నప్పుడు ఆ తర్వాత పరిపాలన సాగించిన రిప్పన్‌ప్రభువుయొక్క గాఢ పరిశ్రమనూ, నిజాయితీనీ, దూరదృష్టియుత రాజకీయ చతురతనూ మెచ్చుకొన

దం ఏనాటికైనా సంభవించగలదా అని నేనప్పట్లో సందేహించాను. రిప్పన్ ప్రభువు ఆ పదవిలోనే ఇంకా కొంతకాలం కొనసాగాలని భారతీయులు సర్వేసర్వత్రా వాంఛిస్తున్నారని నా నమ్మకం. ఆయనను అచ్చట ఉంచ దంలో ప్రభుత్వం ఇతరరంగాలలో ఆయన సేవను కొంతవరకు కోల్పో వచ్చును. కాని మొత్తంమీద చూచినప్పుడు ఈ నష్టమేమీ లెక్కలోనికి తీసుకోవలసిందికాదు. రిప్పన్ ప్రభువు సంకుచిత స్వాభిమానాలకూ, స్వార్థ పూరిత దురాశలకూ, ఆశ్రిత పక్షపాతానికీ లోనుకాడనే విశ్వాసం పరిపాలితులకు కలించాడు. కాకపోయినచో భారతదేశంలో ఇప్పటికినీ ఆందోళన కొనసాగుతూనే ఉండేది.

ప్రస్తుతం ఇంగ్లండుకు వచ్చిఉన్న మజుందారును మీరు చూడాలని నా అభిలాష. ఆయన కేశవచంద్రసేనుని కుడిభుజం ఒక విధంగా కేశవచంద్రసేనునికన్నా బుద్ధి వైశద్యంలోనూ, విచక్షణాజ్ఞానంలోనూ మజుందార్ మిన్న. అయినప్పటికీ అతడు కేశవచంద్రసేనుని అనుయా యిగానే వర్తిస్తాడు. వారిద్దరూ ఇప్పటికీ సక్రమ మార్గంలోనే ముందుకు సాగుతూ కృషిచేస్తున్నారు. ఆ కృషిలో వారు సాగించే బీజావాపనలో, జలసేచనలో తోడ్పడటం ఒక రకంగా సంతోష దాయకమైన కార్యం. వారు సాగించే కృషిఫలితం వారుగానీ, మనంగానీ జీవించిఉన్న కాలంలో లభించకపోవచ్చు. కాని కృషిచేయడం మన విధి"

---

2. మాక్స్‌ముల్లర్ సర్ హెన్రీ ప్రాన్సన్‌బీ కి 18 జులై 1887 సం॥ లో వ్రాసిన లేఖాంశాలు:

"ఆలశ్యం చేసినందుకు ఇంకా కొంత అపాయం వాటిల్లగలదనే భయంతో రుక్మాబాయికేసును గురించి భారతదేశంలోని బాలవితంతువు లని చెప్పబడేవారి దుర్దవస్థను గురించి విశేషాలన్నిటినీ రాణీగారి యెదుట పెట్టాలనే కోరికతో నా శక్తిమేరకు ఈ విషయాలను వ్రాశాను.

నేను సూచించే ఉద్దేశానికై స్త్రీ జన నిధినుండి ఏ కొంచెం వాటా నైననూ వినియోగించడం అసాధ్యమని నాకు బాగా తెలుసు. అయితే రాణీగారు తెలియపరిచే ఒక సానుభూతి వాక్యమైనా, ఒక ఆమోదసంజ్ఞ అయినా ఈ తరుణంలో ఎంతో సాయపడగలదు. అయినప్పటికీ ఇందుకు కూడా కొన్ని అడ్డంకులు కలవనే విషయాన్ని నే నర్థం చేసుకొన్నాను. 'ఇండియా ఆఫీసువారు' ఇందుకు వ్యతిరేకిస్తారనే విషయం దాదాపుగా యదార్థమేనని నేను అనుకొంటాను. ఇట్లా వ్యతిరేకించడమే ఒక మేలుబాటగా ఆ ఆఫీసువాళ్లు భావిస్తారు. ఈ సందర్భంలో ఒక విషయం చెప్పాల్సిఉంది. వైభవోపేతులగు భారత సంస్థానాధిపతులను కలిసికొనడానికై నన్ను రాణీగారు అత్యంతకృపతో ఆహ్వానించినందులకూ, ఆమె కృపాకటాక్షాన్ని మరల నూతన రీతిలో నాయెడల చూపినందులకూ నా హృదయం ఎంతగానో స్పందించింది."

---

3. బ్రిటీష్‌పాలన కాలంనాటి భారతదేశ గవర్నర్— జనరల్ కర్జన్‌కు మాక్స్‌ముల్లర్ వ్రాసిన లేఖ.

27 జనవరి 1899,

ప్రియమైన కర్జన్‌కు,

నేను ఈ మధ్యనే ప్రచురింపబడ్డ నా రచన పంపసాహసిస్తున్నాను. అది భారతీయ షడ్దర్శనాలను గురించినది మీకు దీన్ని చదవడానికి తీరుబడి దొరుకుతుందని గానీ. అంతేకాదు మీకు చదవాలనే ఇచ్ఛ ఉంటుందని గానీ పంపలేదు. అయితే భారతదేశసారస్వతంలో ఇప్పటికీ వెలికిరానివీ, ఏ కొంచెమాత్రమో వెలికివచ్చి ఇంకనూ అజ్ఞాతంగా ఉండిపోయినవీ ఎన్నెన్నో విశేషాలు కలవని మీరు గుర్తించినచాలు. ఇంకొక వింతవిషయం. గ్రీకు దర్శనశాస్త్రం గ్రీసుగడ్డనుండి ఏనాడో అదృశ్యమైంది. కాని భారత దర్శనాలు మాత్రం ఈ నాటికీ వారణాసిలో తావు ఏర్పాటు

చేసుకోవడమేకాదు. కోటానుకోట్ల భారతీయులభావనలపైనా, ఏదోవిధం గా వారి కర్మకాండలపైనా తన ప్రభావాన్ని ప్రసరింపజేస్తున్నాయి. వేదాంత సాంఖ్యములను అనుసరించేవారు నేడునూ ఆదేశంలో ఉన్నారు. రెండువేల సంవత్సరాల పూర్వం ఆయా వాదావలంబకులు జీవించిన మాదిరిగానే నేడునూ తమ జీవితయాత్రను సాగించుచున్నారు.

నా గ్రంథంలోపి లోటుపాట్లనుగురించి నాకు బాగాతెలుసు. కాని భారత దేశంలోని తీవ్రభావుకులకు మనం వారిని చిన్నచూపుచూడటంలేదనీ జీవిత సమస్యలను ఎదుర్కొనే సందర్భంలో వారిని మనకు సమానులుగా పరిగణించుచున్నామనే ఉద్దేశంతో మాత్రం అసంపూర్ణరూపంలోనైనా ఈ రచనను ప్రచురించడం ఉపయోగకారి అవుతుందని నేను భావించాను. దార్శనిక చర్చలలో వారవలంబించే పరిపూర్ణ ఋజువర్తనం. అందులో ముఖ్యంగా కొంతవరకు దార్శనికవిషయాలకు సంబంధించీ కొంతవరకు మత విషయాలకు సంబంధించీ ఉండే సమస్యలను వారు సమన్వయించుకొనేతీరు వారిపట్ల నాకెంతో ఆదరభావాన్ని కల్పించాయి. భారత దేశంలో మతం ఆచరణలోనికి కొనిరాబడి తన పరాకాష్ఠరూపాన్ని అందుకొన్న అధిభౌతికశాస్త్రమనీ మనమిచ్చట జ్ఞాపకం ఉంచుకోవాలి. మీ అమూల్య కాలాన్ని ఇందులకై వెచ్చించాలని నేను ఆశించను. 'ఆల్ సోల్స్ మత పీఠం'లో మీరు విశిష్ట సభ్యత్వాన్ని పొందక పూర్వంనుండీ, అంతేకాదు మీరు వైస్రాయి కాకపూర్వంనుండీ కూడా మీ జీవితగతిని ఆసక్తితో పరికించగా మీ యందు నాకేర్పడిన మన్ననకూ, సౌహార్దానికీ స్వల్పచిహ్నంగా పంపిన ఈగ్రంథాన్ని అంగీకరించి స్వీకరించవలసిందిగా మిమ్మల్ని అర్థిస్తున్నా.

భవదీయుడు

**ఎఫ్. మాక్స్‌మూలర్**

## 4. రాజా రమాకాంతదేవ్‌కు వ్రాసిన లేఖలోని కొన్ని అంశాలు

"నా ఋగ్వేద ప్రచురణయందలి ప్రథమసంపుటం మీకు చేరిన వెంటనే 1851లో మీరు నాపేర వ్రాసిన ఉత్తరం ఎంతో ఆలస్యంగా ఇప్పటికి నాకు చేరింది. అది చేరునప్పటికి రెండవ సంపుటపుపనికూడా దాదాపుగ పూర్తి అయింది; అందువల్ల మీకు జవాబు వ్రాయడాన్ని కొంతకాలం వాయిదా వేసికొనవలసి వచ్చింది కారణం ఏమంటే మీ ఋషుల పవిత్ర ఋక్ సముదాయాన్ని, అందుపై 14వ శతాబ్దిలో సాయణునిచే రచింపబడిన భాష్యంతో సహా సకాలంలో ప్రచురించగలనని నా కృత నిశ్చయతను ఇదివరలో నేను ఉద్ఘాటించినందుకనుగుణంగా నావిధిని నేను నిర్వహించానని మీకు చూపించుటకైనా, నా రెండవసంపుటాన్ని నాజవాబుతోకూడ మీకు పంపుటకు వీలుఅవుతుందనే నేను ఈవిధంగా మీకు జవాబు వ్రాయడంలో ఆలస్యం చేశాను. నా ఉపోద్ఘాతంలో, మీ ఉద్గ్రంథానికి నేనెంతయో ఋణపడి ఉన్న విషయాన్ని ప్రస్తావించియే ఉన్నాను, ఆ ఉద్గ్రంథం మూలంగా మీ దేశీయులలోనే కాదు, పాశ్చాత్య పండితలోకంలోకూడా మీ పేరుప్రఖ్యాతులు విస్తరించాయి. తథా చ శ్రుతి;

మీ శ్రుతి ఇటుల చెప్పుచున్నది. "ఒక మనుజుని సత్కర్మలకీర్తి ప్రపంచమున ఎంతకాలము మనగలుగునో అంతకాలము అతడు స్వర్గమున వసించును."

కలకత్తాలోనో, వారణాసిలోనో వసించి మీతో, మీ పండితులతో మీ ప్రాచీన మతమును, మీ పవిత్ర వేదములను, మీ సంప్రదాయాలను, భారతదేశమున మీ మతషభావిగతిని గురించి విద్వద్గోష్ఠిని సాగించుచు కొంతకాలము నేను గడపగలిగిన ఎంత బాగుండును. నేను ఉబుసుపోక ఏదో కుతూహలం మేరకు వేదపఠనకై పూనుకొనలేదు: కోటానుకోట్ల మానవులు తమ ధార్మికభావనలను రూపొం

దించుకొనడానికి ప్రాతిపదికగ అనేక శతాబ్దాలకాలము వర్ధిల్లగలిగిన ఒక కృషిని అర్థం చేసికొనవలయుననే ఆకాంక్షే నన్ను వేదపఠనానికి పురికొల్పింది. ప్రాతకాలపు విశ్వాసాలతోడను, పూజా విధానాలతోడను మనము ఎంతగనో విభేదించవచ్చును. కాని ప్రతి మత ధర్మాన్ని గౌరవభావంతోనే కాదు, భక్తిభావనతోసైతం అర్థం చేసికొనవలసిన బాధ్యత మనపై ఉన్నదని నాకు తోస్తున్నది. మతముల అన్నింటి మూలభావనయూ ఎల్లెడల ఒకేవిధముగ కన్పట్టుచున్నది. ఒక పరాశక్తి అస్తిత్వమునెడల విశ్వాసమును, తన అల్ప మేధాశక్తిచే మానవుడు సంభావించిన ఆ పరిపూర్ణసత్తకు, ఈ సృష్టికి కారణమగు ఆ పరమేశ్వరునికి అంకితమగు రీతిలో తన జీవితమును మానవుడు సరిదిద్దుకొనవలసి యున్నదను దృఢసంకల్పమును ఈ మూలభావనయందు అంతర్భాగములు. నేనునూ, నాబోటి ఇతరులునూ ఆశించినటుల వేదపఠనము మాకు కన్పట్టియుండక పోవచ్చును. కాని ఆ పఠనకృషి మాకు ఆశాభంగమును మాత్రము కలిగించింది కాదు. మతంతో ఏ రీతిగనూ ముడిపడని విషయాలును అందు చాలా కలవు; కాని అవిసైతం మాకు ఆసక్తిజనకాలుగానే పరిణమించాయి. ద్యూతాసక్తుని గీతం; అగస్త్యలోపాముద్రల, యమీయముల, ఊర్వశీ పురూరవుల సంభాషణా గీతములు మొదలగునవి ఇట్టివియే ఇవి అన్నియూ విస్మృతసాంఘికవ్యవస్థకు అవశేషములు. ఇక అయురారోగ్య సంపత్తుల నర్థించు ఋక్కులు వాని సహజ సరళ ధోరణితో ఒకనాటి ఆదిమమానవ సాంఘికవ్యవస్థారీతికి తగినట్లుగానే కన్పడుతున్నాయి. కావి ఇవిగాక అచ్చమగు ధార్మికభావనను ప్రదర్శించు భాగములును కొన్ని ఉన్నాయి. "ఏకం సత్ విప్రా బహుధా వదంతి" సత్యం ఒక్కటే; ఋషులు అనేక విధాలుగా దానిని గురించి చెబుతారు. "యో దేవేషు అధిదేవ ఏక ఆసీత్" 'దేవతలందరికి అధిదేవుడగువాడు అతడు'—అనునవి ఇట్టివి. ఇంతేకాదు సరళనీతివాక్యములును అచ్చట కన్పడుతాయి; ఇవి సదా మననం చేయతగినవి.

ఇట్టివే. "త్రాటినుండి విడిపించినటుల పాపమునుండి నన్ను విముక్తుని చేయుము."

"దూడ మెడనుండి పలుపును తొలగించినటుల పాపమును నానుండి తొలగించు; నిన్ను విడిచి దూరమేగి, నేను ఒక క్షణకాలమైననూ ఉండలేను గదా!"_అనునవి అట్టివి.

ఇట్టి ఉదాత్తగీతములు సంహితలో కొలదియే ఉండవచ్చు; అయినా వానిలో పెక్కుంట కన్పట్టే ఉదాత్తతా, స్వచ్ఛతా, సరళతా అసదృశములు. తరువాత అందువలననే ఒక విషయం నాకు ఎప్పుడూ ఆశ్చర్యమును కల్గిస్తుంది ఇట్టి సంహితను తరువాత కాలమున అవేకునెట్టి, ఆర్యావర్తవాసులంతటి ఒక విశిష్ట జాతి, తమకు నైతికంగాగానీ, ధార్మికంగాగానీ వైజ్ఞానికంగాగానీ, ఏ పరిస్థితిలోను మత ప్రామాణిక గ్రంథాలుగా ఉపకరింపజాలని పురాణాలపై ఆదరాన్ని ఎలా చూపించగలిగిందా అను విషయం నాకు అర్థం కావటంలేదు.

పాతకాలపు మత పూజా విధానాలను అధిగమించే భవితవ్యం భారతప్రజలకు అందుబాటులో ఉండగలదని నేను దృఢంగా ఆశిస్తున్నాను. అయినా వారి ప్రాచీనఋషులు తమ మతభావనకు పరమావధిక ప్రామాణ్యముగ భావించిన వేదమును బాగా పఠించే అవకాశాన్ని వారికి మరల చేకూర్చుటలో నా ఋగ్వేద ప్రచురణ, ఏ విధంగానైనా కొంత సాయపడితే అది వారి పురోగతిలో ఒక అడుగుగనే పరిణమిస్తుందనీ, తిరోగతికారకం కానేరదని నేను భావిస్తున్నాను. అయితే తక్కిన అన్నింటివలెనే మతములు సైతం కాలక్రమాన వార్ధక్యాన్ని పొందుతాయనే విషయాన్ని మనం మరువకూడదు. నాలుగువేలసంవత్సరాల వయసు పైబడిన ఏమతం ఏనాడూ ఆ వయోధర్మాన్ని అధిగమించి నిలువలేదు. ఒక మతంయొక్క ప్రాచీనత, దాని అతిదీర్ఘకాలపు అస్తిత్వమూ దానియందలి సత్యమునకు నిదర్శనము అనుట సరికాదని నాకు అనిపిస్తుంది. ఎంత ప్రాచీనత కల్గి ఉంటే అంతగ అనుపయోగమై అది సారమును కోల్పోతుంది; క్రొత్త కాలాలకు అంతగా అది అనుచితం అవు

తుంది. ఇక దానికి ఒక సంస్కరిత రూపాన్ని ఇవ్వడమో లేదా ఒక సమర్థతరమగు నూతన మతరూపానికి తావు కల్పించుటకై దానిని అంతరింపజేయటమో జరగవలసి ఉంటుంది.

నన్ను ఒక మ్లేచ్ఛుడుగ మీరు భావించవలసి ఉండుననే విషయం నాకు తెలుసు. అయినా ఒక మాట చెప్పనియ్యండి; నాకుమాత్రం మీ యెడలగానీ, ఏ దేశీయుల యెడలగాని అట్టి ఏహ్యాభావం లేదు. ఇంతే కాదు; అన్ని వర్ణములవారును అనగా బ్రాహ్మణునివలెనే శూద్రుడునూ బ్రహ్మమునుండియే ఉద్భవించిరనీ, ప్రకృతిగుణములును, దైవత్వమును మానవులందరియందును ఒకేరీతిగ వర్తించుననీ మీ వైదికఋషులలో ఒకరు చెప్పినారనే విషయాన్ని మీరు మరచిపోకండి. భగవానుని సన్నిధిలో మానవులు అందరును సమానస్థాయిలోనివారలే అని మా దృఢాభిప్రాయం. అట్టి మానసిక వైఖరితో, అట్టి భావస్ఫూర్తితో ఆదరయుతముగా సదా మీయెడల సహృద్భావనతో వర్తించు—

భవదీయుడు

మాక్స్‌ముల్లర్



# PASCHATHYA RISHI
# MAX MULARU
## JIVITHAM : SANDESAM

*Published by:*

Manava Vijnana Mandir

BY:

D. SRIDHARA BABU M. A.



*Distributors :*

Andhra Saraswatha Parishad

Tilak Road, Hyderabad.

Manava Vijnana Mandir

Publication No. 1